# అభ్యుదయం

[నాటికల సంపుటి]



కొలకలూరి ఇనాక్



జ్యోతి గ్రంథమాల
129, తపోనగర్
అనంతపురం - 515 004.

ABHYUDAYAM : a collection of playlets by

Dr. KOLAKALURI ENOCH
Professor of Telugu
S.K. University, Anantapur-515 003.



ప్రథమ ముద్రణ : 1985

ద్వితీయ ముద్రణ : 1992

వెల : 21.00

ప్రతులకు :

జ్యోతి గ్రంథమాల
129, తపోనగర్
అనంతపురం - 515 004.

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/B/1, న్యూ బాకారం
గాంధీనగర్, హైదరాబాదు-380,
ఫోన్ : 611413

# శుభోదయం

భారతదేశంలో సమస్యలకు కొదవలేదు. హరిజనత్వమే అనంత సమస్యా సంతానానికి వారసత్వం.

'దిక్కు లేనోడు' నాటికలో స్వేచ్ఛగా, తీరుబడిగా, నలుగురి కళ్ళెదుట చేయబడ్డ హత్య ఉంది. ఈ రచన కల్పితం అన్నాను. కాదు జరిగిందని మీరంటారు. ఎక్కడా జరగలేదనీ, ఎప్పుడూ జరగదనీ, మనం అనగలిగిన్నాడు అనుకోగలిగిన్నాడు మనం అన్నదమ్ములం, లేకపోతే దాయాదులం.

'నిర్భయం' 'సమానత్వం' 'న్యాయం' 'దర్శనం' 'కూలీ' హరిజన జీవితం చిత్రించిన నాటికలు. ఇదంతా వాస్తవంగా ఉందని ఆనందిస్తే సుఖంలేదు. అంతా అసత్యమని ఋజువుచేస్తే సంతోషం.

ఎవరా సమర్థులు ?

ఏరా మహాత్ములు, ప్రవక్తలు ?

వాళ్ళకు ఆహ్వానం! వాళ్ళ జన్మకు ఆహ్వానం. వాళ్ళ అవతరణకు అనంతాహ్వానం.

'దిక్కులేనోడు' (1978) ప్రచురించిన భారతికీ; ఇందులోని ఇతర నాటికలు (1983) ప్రసారం చేసిన హైదరాబాదు ఆకాశవాణికీ; రాయించిన సంఘానికీ, సాంఘిక సంక్షేమానికీ ధన్యవాదాలు.

అనంతపురం

2-3-1985

కొలకలూరి ఇనాక్

# సూచి


1. దిక్కులేనోడు ... 1

2. నిర్భయం .... 26

3. సమానత్వం .... 36

4. న్యాయం .... 46

5. దర్శనం .... 57

6. కూలీ .... 69

# దిక్కులేనోడు

పాత్రలు :

1. కోటేసు — యువకుడు
2. ఏకో నారాయణ
3. సాంబడు — మధ్యవయస్కులు
4. బెమ్మం
5. పుల్లయ్య — వృద్ధుడు

స్థలం :

పల్లె, నాలుగు వీధులు కలిసేచోట చెట్టు, చుట్టూ అరుగు.

సమయం :

మధ్యాహ్నంనుంచి సాయంకాలం దాకా

(తెర తీసే సరికి చెట్టుకు కట్టేసిన కోటేసు, అరుగుమీద రెండు పక్కలా నిలబడ్డ సాంబడు, బెమ్మం, కింద ఏకోనారాయణ.)

కోటేసు : బెమ్మన్నా నన్నొదిలిపెట్టండి - నన్ను పోనీయండి.

సాంబడు : అరిస్తే గొంతులో పొడుస్తా. ముయ్ నోరు !

బెమ్మం : ఒరే తిక్కోడా పొరపాటయిందా'వటాని తప్పొప్పుకోరా - ఎల్లొచ్చు.

ఏకోనారాయణ : శ్రీశ్రీ కోటేసుల వారిని కోప్పడకండిరా - మహారాజా వారు చెప్పినట్టు ఇంటారంటాంటారా - చెప్పు దెబ్బలు తింటారుగాని.

కోటేసు : ఏం దిది అన్నే యంగా—నన్ను బోనీయండి.

ఏకో : అన్నే యంగా ఎందుకురా - నేయంగా తన్నండి. యాడికి పోతావురా కోటేసులవారూ! వల్లకాట్లోకా? దెయ్యాలుంటా యిరా పిల్లసన్నాసి. చెట్టే నయం.

కో : మీకంటే ఇంకేం దెయ్యాలు? నేనెల్లాలి. నన్ను బోనియ్యండి.

ఏ : పోతావేం ? పో! ఎట్టాబోతావో సూత్తా-ఊ- పోరా ! - కోడిపెట్ట సీడబెట్టి పో !

కో : కోడిపెట్టా ? ఏం కోడిపెట్ట ?

ఏ : గుడ్లు పెట్టే కోడిపెట్ట-చూశ్శా చెప్పరా - సాంబా !

సా : దొం కోళ్ళా నాకొడకా (కడుపులో పొడిచాడు).

కో : అమ్మా !

సా : అరిత్తే సంపుతా ! తిన్నప్పుడెట్టుందిరా !

కో : నాకేం తెలియదు. నిజం.

సా : అబద్ధాల నా కొడుకా! అరిత్తే నరుకుతా! తిన్నది అరిగిందంటూరా?

కో : ఒట్టు ! అమ్మతోడు- నాకేం తెలియదు.

ఏ : ఊరకనే ఆణ్ణిజం చెప్పటానికి ఎర్రోడా ఏమన్నానా? - ఉతకరా- నాలుగుతుకు !

సా : (డొక్కలో పోటు.)

కో : అమ్మా !

బె : చెప్పరోయ్ ! ఊరకే తన్నులెందుకు దింటావ్- చెప్పరా కోటిగా·

సా : (డొక్కలో పోటు.)

కో : అమ్మా !

బె : ఒరె నిజమొప్పుకోరా !

ఏ : నీ పిచ్చిగానీ- బెమ్మం - ఆణ్ణిజం జెప్పటానికి అంత పనికి మాలిన వాడనుకొన్నావంటరా- శాశా - కోటేసులవారు నిజం ఊరకే చెప్పర్రోయ్ నాలుగు వాయి త్తేనే !

కో : నేన్నిజం చెబుతున్నా - నిజం - నాకేం తెలియదు. ఎంత ఒట్టు అయినా సరే !

సా : (పోటు)

కో : అమ్మా !

ఏ : అమ్మా అని ఏడుత్తావేందిరా పిల్లసన్నాసి - ఓసి అమ్మాయో— నీ మూలంగా ఎంతమూడిందే అని ఏడిచ్చావు - ముచ్చటగా వుంటుంది. బెమ్మం సూత్తావేందిరా-ఎయ్ !

బె : బులపాటం అయిపుట్టిన్నా కొడుక్కి ! (జుట్టు పట్టుకొని తల వెనక్కు విసిరి చెట్టుక్కొట్టాడు.)

కో : అమ్మా !

ఏ : అమ్మాయి కాదా !

కో : అమ్మా !

బె : నోరు ముయ్‌రా !

ఏ : ఆడు నోరుమూత్తే పల్లెందు కింతగా బరితెగిచ్చి పోద్దరా ! ఊరెందుకిట్టా నాసినం అయిపోద్దరా ! ఈణ్ణి గౌరంగా పిలవా లంట. ఏరా ఓరే అనరాదంట. ఇన్నారు గదండిరా ! ఏరా కోటేసులవారూ ఇంటన్నావా?

కో : ఎవర్ని గూడా తేలికగా లెక్కలేకుండా పిలవొద్దన్నానే కానీ—

ఏ : చూశావా-ఆణ్ణోరు మూయలేదు !

బె : ముయ్‌రా నోరు (తల చెట్టుకొట్టాడు)

కో : అమ్మా !

ఏ : అంతేరా ! ఆణ్ణోరు మూయడు. మీరు మూయిచ్చలేరు.

బె : ముయ్ (చెట్టుకొట్టాడు) ముయ్‌నోరు.

కో : అరవలేదు.

ఏ : (ఆశ్చర్యంగా) వీణ్ణోరు మూశేడురోయ్ -ఏది-మళ్ళీ-

బె : (కొట్టాడు)

కో : (అరవలేదు)

ఏ : (పెద్దగా నవ్వి) ఇంక భూకంపం వచ్చుద్దిరా ! ఈణ్ణోరెత్త లేదంటే దేశాని కేడో మూడిందిరా ! ఒరే కోటేసుల వారూ ! వంతెన మీదెక్కి ఆళ్ళు జావాలి, ఈళ్ళు జావాలని, అది నసిచ్చాలి ఇది నసిచ్చాలి అని, అంత గొంతు గాంపోను రికాడ్డురు మల్లే కుయ్ కుయ్ మనిపిచ్చే వోడివే ! ఇప్పుడే వయిందా నోరు ! ఊ సూత్తారేంరా !

బె :
సా : —(ఒకేసారి కడుపులో పొడవటం-చెట్టుకొట్టటం)

కో : (పెద్దగా) అమ్మా !

ఏ : పరవా లేదు లెండిరా ! ఈ దరిశే దంటే దేశానికి పెమాదం దప్పింది. లేకపోతె గొప్ప చిక్కే ! అయ్యా మహారాజ రాజశ్రీ కోటేసుల వారూ ! ఆ అమ్మాయి జొన్నచేలో అమ్మా అందా అయ్యా అందా ! చెప్పరా సోద్దెం ఇందాం !

బె :
సా : -చెప్పు! (కొట్టారు)

కో : నాకేం దెలియదు.

ఏ : ఏమీ తెలియదా ? నిజ్జంగా!

సా : కోడో!

బె : పిల్లో!

ఏ : కోడిపిల్లో

కో : నేను మీకే అపకారమూ చేయలేదు. నన్నెందుకు ఇంతగా హింస పెడతారు. మీకు పుణ్యం ఉంటుంది. నన్ను పోనీయండి.

ఏ : యాడకి? జొన్న చేలోకా! ముళ్ళు గుచ్చుకుంటాయి గందరా!

బె : పిల్ల ఏడుసుద్దా?

సా : కోడి కూరుందా?

కో : మా పల్లెలోకి నన్ను బోనీయండి.

ఏ : ఏం జనాన్ని ఎంటేసు కొచ్చి, తల గొట్టి మొలెత్తావా?

కో : అదేం చెయ్యను నన్ను బోనీయండి-బతకనియ్యండి.

ఏ : మరి మా కోడి పెట్ట మాటేంది? అది రోజుకు ఇరవై గుడ్లు పెట్టేది. ఏభై పిల్లల్ని చేసేది-అదేమన్నా అల్లా టప్పా పెట్టా-దేవతా కోడిపెట్ట-నీ పొట్టన పెట్టుకొన్నావ్-పొట్ట బగిలి సత్తావ్-పగల బొడవరా!

(సాంబడు బెమ్మం కొట్టటం - కోటేసు అరవడం.)

కో : ఏకోనారాయణగారూ - ఇదన్యాయం - ఆ కోణ్ణాకు తెలియదు.

ఏ : ఆచారి కూతురో! అది తెలియదంటారా కోటేసులవారూ!

కో : ఏకోనారాయణగారూ! మీ కోడిపెట్టకీ - ఆ అమ్మాయికీ ఏంటి సంబందం?

ఏ : ఆహాహాహా! పుంజు కూతకొచ్చిందే! కోసుకుతింటే రుచి! ఏందిరా కూశావ్?

కో : కోయలేదండి! చెబుతున్నాను. నేను ఆచారి కూతురు ఏ గంగలో కలిస్తే మీకేం? మీ కొంపేం మునిగింది?

ఏ : గంగ - ఎంత పయిత్రం - అంతగా మురిగ్గాటం దేశానికి మంచిది గాదు కోటేసులవారూ - ఊరుకొంటే కొంపలు మునగట మేంది, కొట్టుకు పోతాయి.

కో : మీరున్నారుగా కాపాడటానికి - ఆచారి కూతురు సంగతి మీ కనవసరం. మీ కోడి సంగతి నాకు తెలియదు.

సా : కోణ్ణి నువ్ బట్టుకొన్నావ్!

బె : నేన్జూశా!

కో : అబద్దం - అంతా అబద్దం.

సా : కోసుకు తిన్నావ్.

బె : నేన్జూశా!

ఏ : సెబాష్ - వాసనకూడా వచ్చింది.

కో : అబద్దం - అన్యాయం - మోసం - మీకిది తగదు. మీకు నాశనం మూడుతుంది.

ఏ : కోటేసులవారు పెద్ద పెద్ద మాటలు సెలవిత్తున్నాడురోయ్ - ఆడే నిజం చెబుతాడు - నాలుగంటి త్తేసరి - ఈ!

[బెమ్మం సాంబడు కొట్టడం - కోటేసు అరవటం]

కో : ఆగండి నన్ను చంపకండి.

ఏ : కోటేసులవారు ఏదో ఉపదేశిస్తున్నారు. ఏందేంది? చంపొద్దా? నిన్ను జంపితే ఏం లాబం? కోణ్ణి జంపితే కాల్చుకోవచ్చు, కోసుకోవచ్చు. అయినా నిన్ను జంపటం, కాల్చటం, కోసుకు తినటం వేరువేరుగా ఎందుకు?

కో : ఏందండీ ఆ మాటలు - మీ కోణ్ణి నేను కోసుకు తిన్నా సరా.

ఏ : ము త్తెం - ము త్తెంలాంటి మాట - అచ్చెర లచ్చలు చేసే మాట -

కో : మీక్కావలసిన మాట చెప్పానుగా - నన్నొదలండి. పోనీయండి. నన్నింకా చంపొద్దు.

ఏ : చచ్చిపోదువులే! అయ్యా! కోటేసులవారూ - నేరం ఊరికే పోదు. జరిమానా - జరిమానా పడుద్ది - కోడిరేటు ఏడొందలు, తిన్నట్టు కాదు. డబ్బు కక్కు. కక్కి ఇక్కణ్ణుంచి కదులు అర్థమయిందా?

కో : కోడా? ఏడొందలా?

ఏ : ఆ! ఏమనుకొంటున్నా, అది దేవతాకోడి. అల్లాటప్పాకోడా ఏం? మళ్ళీ మాట్టాడితే ఎయ్యి! ఏదో పొనియ్యిలే అని ఏడొందలనేశా! మాట దప్పేమనిషిని కాన్నేను. అరు నూరయినా ఇంకో మాట లేదు. ఏడొందలే ఏడుప్!

కో : ఏకోనారాయణగారూ మీకిది న్యాయం గాదు. కోడి ఏడొందలంటే ఎవరయినా నవ్వుతారు.

షా :
బె : - (కొట్టటం)

కో : (ఏడవటం)

ఏ : ఎవరయినా నవ్వుతారా? ఏడుత్తారా?

కో : ఏడుస్తారు.

షా :
బె : -(కొట్టటం)

కో : (ఏడవటం)

ఏ : ఇప్పుడు జెప్పు! ఏడుత్తారా? నవ్వుతారా?

కో : ఏడుస్తారు నవ్వుతారు, ఏడిస్తే ఏడుస్తారు. నవ్వితే నవ్వుతారు. ఏడ్చినా నవ్వినా నన్ను చంపొద్దు. మీకు డబ్బిస్తా! - నేను కోణ్ణి చంపాననీ కాదు, తిన్నాననీ కాదు. చావలేక మీ దెబ్బలు తిన లేక, మీకు డబ్బు కడతా. నన్ను బోనీయండి

ఏ : ఏడదెచ్చి కడతా డబ్బు? నీకు చిల్లిగవ్వలేదు. నెత్తిన రూపాయి పెట్టి వేలం వేస్తే పైసాకికూడా కొనరు నిన్ను - కొంటే నీకు పెట్టే తిండి దండగని భయం.

కో : నిజమేమో! అయినా మీ దృష్టిలో మనుషుల విలువ అంతే! ఇల్లు అమ్మి -

ఏ : ముండ మోపిల్లు - అమ్మితే ఎంతొచ్చుది - ఎవుడు గొంటాడు.

కో : పోనీ పొలం——

ఏ : ఏం పొలం? ఎంత పొలం? అమ్మటం కొంటం అదెప్పుడో—— నాకిప్పుడే కావాలి డబ్బు!

కో : నన్ను పోనిస్తే-

సా : పారిపోదామనా?

కో : ఏడకి పారిపోతాను ఈ ఊరు మా పాలిట పెద్ద గోడల్లేని జయిలు-మీరంతా ఉద్యోగం లేని పోలీసులు - నేనేడకి పోగల్ను- అప్పుచేసి మీకు డబ్బు-

బె : నీ కప్పెవడిత్తాడిప్పుడు ?

ఏ : మహారాజ రాజశ్రీ కోటేసులవారూ! నీ కెందుకీ తిప్పలు - ఆ పుచ్చుఇల్లు - ఈ రొచ్చుపొలం ఏడొందల కింద రాసుందిందులో ఏం జదువుతావులే ఒక సంతకం ఈడ బారెయ్! పీడా వదులుద్ది! గోలలేని పని.

కో : నన్నొదలింది - సంతకం చేస్తా -

ఏ : ఎందుకింత మాత్తరానికి నిన్నొదలటం - బలే అస్యమాడతావురా కోటేసులవారూ! కట్టేసింది కట్టెని గాని చేతిని కాదుగా-సంతకం చేసే సందుందిలే! చెయ్! ఎంగిలి ముక్కలు నాలుగు మిణికి నందుకు - సదువు ఎంతుపయోగమో చూడు చక్కగా సంతకం గీకొచ్చు-చెయ్-చెయ్.

కో : నన్నొదలందే చెయ్ను.

ఏ : నువ్జేసే దేంది? నీ తల్లి జేజెమ్మ జేసుద్ది. నీ చెయ్ నరికి పట్టు కొని సంతకం పెట్టిత్తా-అంతదూరం ఎందుకు-లేని పోని అలుపు.

సా :
బె : - (కాగితం తీసుకొని కోటేసును పట్టుకొని సంతకం చేయించారు.)

ఏ : ఒరే కోటేసు - నీ చేతి రాతలో ఏముందో, గానొరే మూడు ముక్కల్లో- నీ యిల్లూ పొలం నాయా! ఎంత మాత్మ్యం రా నీది!

కో : మీరు వేసిన జరిమానా చెల్లించాను. నన్నొదలండి.

బె : వదిలేత్తా ముండు!

ఏ : (కోపంగా బెమ్మంతో) నోరుముయ్ (మామూలుగా కోటేసుతో) కోటేసూ! దేవుడికి దయకలిగితే ఎంతసేపు? తొందరేముంది? కాస్తాగు! (చుట్ట బొడ్లోంచి తీసి నలుపుతూ) ఆ ఏవన్నా?

కో : కట్లిప్పి - నన్ను పోనిస్తే-

సా : వదిలేత్తే ఈడేం జేత్తాడోనే!

బె : ఏడిసేడు! పిల్ల నాయాలేం జేత్తాడీడు!

ఏ : ఏం జేత్తావురా కోటిగా?

కో : ఇంటికి పోతా!

ఏ : ఇంటికా? ఏ ఇంటికి! ఓహో! అదా! అది నా యిల్లు కదరా!

కో : వెళ్ళిపోతా! మా అమ్మను తీసుకొని, ఇల్లొదిలి, పల్లె వదిలి వెళ్ళి పోతా.

ఏ : ఆచారి కూతురో!

కో : నేరం అన్నారు. జరిమానా వేశారు. ఇల్లు పొలం రాయించు కొన్నారు. నన్ను పోనియ్యండి,

సా : పిల్లమాట తప్పిత్తా వేం?

బె : వదిలేసి పోతాళ్ళేరా పిల్లని!

కో : నన్ను పోనీయండి.

ఏ : పోదువు లెద్దూ - ఇంకా పొద్దుపోలేదు - సాంబా అగ్గిపెట్టేదిరా?

సా : (ఇచ్చాడు)

ఏ : (చుట్ట ముట్టించుకొని అగ్గిపుల్ల కోటేసు మీదికి విసిరాడు)

బె : పిల్లనా కొడుక్కాలి సచ్చేను.

ఏ : ఆడూరికే సత్తాడా? పెట్రోలు పో త్తేగాని అంటుకోడు. గట్టిపేణం. (చుట్టు కొరికి ఉమ్మి వేసి పొగవదిలి) సాంబా బెమ్మాన్ని తీసుకుపో! పెట్రోలు టిన్ను ఇచ్చి పంపు. సావిట్లో పెట్టేనే అది-ఇన్నావా?

సా : ఊఁ!

ఏ : వత్తావత్తా ఆచారి దగ్గరకు పోయి సొమ్ము అడిగి తీసుకురా. మహానుభావులు కోటేసుగాణ్ణి చెట్టుక్కట్టాం. కొట్టాం. కాల్చబో తున్నాం అని చెప్పు! వాయిదాల పద్ధతి లేదని చెప్పు. కంతుల వారీగా కట్టటం లేదన్నానను! నాతో మాట్లాడతా నంటాడేమో ఈల్లేదని చెప్పు! సొమ్మిచ్చి ఇల్లు గదలమను - వెంటనే సొమ్మి య్యందే ఆ యిల్లే ఇంటిలపాదికి వల్లకాడని మనివి చెయ్!

సా :<br>బె : - (బయలుదేరారు)

ఏ : ఒరేసాంబా! కోటిగాడు గాలుతుంటే ఆచారి ఇనోదం సూత్తా డేమో రమ్మను-ఈ సినిమాకి కూతురు కూడా వస్తే తీసుకు రమ్మను. కరిగించే మిండగాడు మండిపోవటం కళ్ళారా తనివి తీరా చూస్తుంది-ఏంరా కోటిగా అంతగా ఆనందపడిపోతున్నావ్- అదిరా గొప్పోళ్ళ లచ్చణం- (బొడ్లో తాళాల గుత్తి తడుంకొని). ఒరే సాంబా! (బదులు లేదు) ధూ (లేచి వెళ్ళాడు)

(పుల్లయ్య ప్రవేశం)

పుల్లయ్య : కోటిగా! కోటిగా! యేందిరిది?

కో : పుల్లయ్యమామా కట్లిప్పు!

పు : ఏవయిందిరా?

కో : కట్లిప్పు!

పు : ఎందుకట్టేశార్రా?

కో : కట్లిప్పు!

పు : ఏం జేసేవురా? ఏమయిందిరా కోటిగా - సెప్పవా?

కో : చంపేస్తారు మామా కట్లిప్పు - నన్ను కాల్చి చంపేస్తారు- దేవుళ్ళొచ్చావు. కట్లిప్పు!

పు : ఎవుర్రా! ఎవుర్రా నిన్ను గాల్చేది?

కో : ఏకోనారాయణోళ్ళు - పెట్రోలుతో నన్ను కాలుస్తారు. తేబోయారు. వాళ్ళొస్తే నన్ను ఎవరూ రక్షించలేరు. తొందరగా - మామా తొందరగా రా.

పు : ఆళ్ళు ఎందుగ్గాలుత్తారా నిన్ను?

కో : ఆచారి కూతుర్ని నేను రమ్మనలేదు. వస్తే పొమ్మనలేదు. కోడి కొంపా పొలం పుట్రా పెద్ద నాటకం-దెబ్బలు తినలేక కోణ్ణి తిన్నానని అబద్ధమాడాను. నిజం చెప్పి బతక లేక అబద్ధం చెప్పి బతుకుదామని ఆశపడ్డాను. బతకటం కోసం ఇల్లు పోగొట్టుకున్నా, కూడు పెట్టే పొలం వదులుకొన్నా, పుట్టి పెరిగిన ఊరే విడిచి పెడతానన్నా-విన్లేదు మామా వాళ్ళు. విన్లేదు. వాళ్ళు దెయ్యాలు- ఇంకా సేపట్లో కాల్చి పారేసే కొరివి దెయ్యాలు. కట్లిప్పు!

పు : అట్టాగా-నే నాళ్ళకి సెబుతాలేరా! నువ్ మరీ ఇది గాఁవాక!

కో : ఏం చెబుతావు? - కసాయి వాళ్ళతో, నీ పిచ్చిగాని నీ మాట వింటారా వాళ్ళు? నన్ను విడిపించు!

పు : ఏడకి బోతా!

కో : ఎటన్నా-

పు : ఊరొదిలి ఎట్టా బతుకుతా!

కో : అడుక్కు తిని.

పు : నిన్నొదిలితే-నన్ను వొదులుతా రంటావా వాళ్ళు?

కో : వాళ్ళ కెట్టా తెలుసుద్ది మామా-తెలియదు.

పు : ఇయ్యాల కాకపోతే రేపన్నా తెలవదా?

కో : నువ్వు వదిలేయకపోతే నన్ను చంపేస్తారు. వదిలినట్లు తెలిస్తే నిన్ను తిడతారు, పోనీ కొడతారు. కానీ చంపరు. నేను బతకటం కోసం ఆ మాత్రం బాద బరించలేవా మామా!

పు : నన్ను ఆళ్ళు సంపినా సంపొచ్చురా!

కో : నేను బతికుంటే మాత్రం నువ్వు చావవు. వాళ్ళను చంపయినా సరే నీ ప్రాణం కాపాడుతా!

పు : ఎందుకొచ్చిన సావుల్రా ఇయ్యి! మనం బతికి సచ్చేదెట్లా? ఈ వూరొదిలి పోలేం గందా? ఏ సెర్లో సేప ఆ సెర్లో బతకాలి కదరా!

కో : అయితే నేను చచ్చిపోవాలనే అంటావు - అంతేగా! - కానీలే -

పు : ఆళ్ళకి నేను సెబుతాగా - రానీ -

కో : ఏం చెబుతావు - పెట్రోలు అగ్గిపెట్టె - అంతా మంటే - వాళ్ళొచ్చారో - నేను చచ్చానే.

పు : సంపర్లేరా-నీకెందుకూ నేనుండగా-నువ్వట్టా సూత్తావుండు. ఎట్టా సెప్పి అంతా సరిసేత్తానో!

కో : నీ ధైర్యానికి ఆశకీ నేను ఏడవాలో నవ్వాలో తెలియటం లేదు - ఇవాళ నన్ను, రేపు నిన్ను, ఎల్లుండి నీ కొడుకును, ఏడాది తిరిగే సరికల్లా పల్లంతా వల్లకాడు కాకపోతే-

పు : అట్టా కాదులేరా -

కో : అయితే ఇట్లాగే నీచంగా సస్తూ బతుకుతూ -

పు : ఇప్పుడేవయిందిరా కోటిగా నువ్ మరీ ఇదవటమేగానీ -

కో : ఇప్పుడే మయిందంటున్నావా మామా. కుక్కలకన్నా హీనంగా పశువులకన్నా లొచ్చుగా, పురుగులకన్నా కనాకష్టంగా, బతకటం బాగుందా-కొట్టినా ఉలక్క, తిట్టినా పలక్క పెళ్ళాల కూతుళ్ళ అమ్మల అక్కల శీలం గంగపాలో, రైలుపట్టాలపాలో, నేలపాలో అవుతుంటే బాగానే వుందా - రోజంతా పనిచేసి, పొలమంతా పండించి, ఏడాది పొడుగునా తిండిలేక అడుక్కుతింటూ దిక్కు మొక్కు లేకుండా పడివుండటం హాయిగా వుందా? నీ పొలం నీ యిల్లు నీ వాళ్ళు నీవి కాకుండా పోతుంటే ఇంకేం కావాలి? తినే హక్కు, బతికే హక్కు, మనిషిననే హక్కు లేకుండా పోతుంటే ఇంకా ఏం కావాలి? మామా ఇప్పటికే చాలా అయింది. ఊరుకుంటే ఇంకా చాలా అవుద్ది. నువ్విలా ఊరికే వుంటావా? ఇలాగ్గా-ఇట్లా- చూస్తుండు, పెట్రోలు తెస్తారు, కాలుస్తారు. కళ్ళెదుట-ఒకేఒక మంట-ఆరని మంట శాశ్వతంగా మంట. నువ్వూ నీ బిడ్డలు మునుపటిలా కాళ్ళ కిందయినా పడి చావాలి లేకపోతే కాలి చావాలి. అందాకా నీకు విశ్రాంతి లేదు. అందరిలాగా ఉంటానని ఎన్నడన్నా అంటే వాడి అంతం నీ కళ్ళెదుటే- చూస్తుండగానే- మామా నా శవం కాలి, మాడి, బూడిదై గాలిలో నీళ్ళలో, నోట్లో, కూట్లో, దుమ్ము-పో మామా నన్నొదిలేసి పో-

పు : నువ్ చెప్పేది మాబాగావుందిగాని ఒరే సూత్రా సూత్రా తప్పెట్టా జేసేదిరా?

కో : తప్పా? ఏది తప్పు మామా! నాదా? వాళ్ళదా? ఈ బతుకులదా? ఏది తప్పు! నేను పుట్టటం తప్పా! బతకటం తప్పా? చావటం తప్పుకాదా?

పు : ఆళ్ళు కట్టేత్తే - సెప్పకుండా - ఇడిపించటం తప్పు కాదంటావా?

కో : తప్పు కాదని ఎట్టా మామా అనటం? తప్పు! పెద్ద తప్పు! విశ్వాసం లేని పని. కుక్క విశ్వాసం గొప్పది. మామా నువ్వు పెద్ద కుక్కవి. విశ్వాసం పెంచుకో, పంచుకో. సొంతవాళ్ళని చంపుకో! ధర్మం, నీతి, న్యాయం పేరిట పిచ్చిఎక్కి నీ వాళ్ళంద రినీ కలిపి పిచ్చెక్కించి చావు, చంపు పో.

పు : ఆళ్ళమీద ఆదారపడ్డావోళ్ళం గందా- ఆళ్ళ కిట్టంలేని పనెట్టారా. చేయడం?

కో : కుక్కకు కూడు విసిరి వేసినట్టు నీకు పడేస్తారు. బతుకుతావు. బాగా బతుకుతావు. కుక్కను కొట్టినట్టు కొడతారు చస్తావు. విశ్వాసంగా చస్తావు.

పు : నిన్ను వదిలితే నిజమేరా కుక్కను గొట్టినట్టే- నన్నూ- ఆ-అంతే!

కో : నీకు దెబ్బలు తగలరాదు మామా- వద్దు- నేను చచ్చినా పరవా లేదు. నీలాంటి వాళ్ళు బతకాలి. కూటికోసం- కుక్కల్లా- కరుసు కొంటూ, అరుసుకొంటూ, నిజంగా పిచ్చికుక్కల్లా పుచ్చెలు పగిలి ఏడుస్తూ చస్తూ బతకండి-

పు : నాకేందో బాదగా వుందిరా?

కో : బాదా? నీకా? మనకొక బాదా? ఇంకా నయం. మరీ మనిషల్లే మాట్లాడకు మామా! బాదేవుంటే-రా! మగాడిలా రా! విప్పు! నీ ప్రాణానికి నా ప్రాణం. మనం కలిసి బతుకుదాం. కలకాలం మన జనం సుఖంగా, సంతోషంగా మనుషల్లాగా బ్రతకటం చూద్దాం. నన్నొదులు- రా అరుగెక్కు.

పు : అళ్ళక్కడ కూచుంటార్రా-నేనెట్టా ఈ కాళ్ళతో అడ కెక్కేదిరా?

కో : వాళ్ళు కూర్చునే చోటే నా కాళ్ళు వాళ్ళే కట్టేసి వుంచారు. పరవా లేదు మామా- ఎక్కు. విప్పు!

పు : [భయం భయంగా ముందుకు వచ్చాడు]

కో : తొందరగా రా మామా-తొందర-వాళ్ళొస్తున్నారు.

పు : ఆ! [అడుగు వెనక్కు వేశాడు] వత్తున్నారా? [అటూ ఇటూ చూశాడు]

కో : తొందరగా-మామా-గబగబా-వాళ్ళు వచ్చేలోగా నన్ను వదిలేయ్-రా-తొందరగా-

పు : వచ్చేశార్రా. నిన్ను నేను వొలిదిపెట్టలేనురా- ఏమనుకోకు!

కో : అమ్మా! వాళ్ళు నన్ను చంపుతారు- పెట్రోలు టిన్ను తెచ్చేశారు.

పు : లేదురా కోటిగా! నేను ఆళ్ళతో చెబుతాగా ఆళ్ళు నా మాటింటార్లే. నిన్నొది లేత్తారు-నేను చెబుతాగా- నువ్వట్టుండు!

కో : [నవ్వు] నువ్వా!

పు : నీ కెందుకు ఆ పూచీ నా కొదిలెయ్! సరేనా?
(ఏకోనారాయణ, సాంబడు, బెమ్మం పెట్రోలు టిన్నుతో ప్రవేశం)

ఏ : ఎవ్రడదీ పుల్లిగాడా! ఏరా పుల్లిగా, ఏందిట్టావచ్చా?

పు : దొరగోరూ! మీతో చిన్న మనివి చేసుకుందారని-

ఏ : ఏంది రది?

పు : మా బుడ్డోడి కేం తెలవదండి - ఎర్రోడు-అణ్ణాది లెయ్యండి-నా చరమం వొలిచి చెప్పులు కుట్టిత్తాను.

ఏ : వొద్దురా పుల్లిగా-మీ వొళ్ళు పొగరెక్కిందిరా! ఆ పొగరు చెప్పులు కాళ్ళు కొత్తుకొంటాయి.

పు : అది గాద్దొరా!

ఏ : నోరు ముయ్యిరా-ఈడు జేసింది జూశా! ఇయాల కోడి పెట్ట యింది-రేపు కోడె దూడవుద్ది. ఎల్లుండి-ఇంకేమన్నా వుందా? ఏవంటా?

పు : అడ ట్టాటోడు కాదు లెండి.

ఏ : మరి నేనా?

పు : నోరు పడిపోదూ! మిమ్మల్నెంటా అంటామండి! అణ్ణాదిలెయ్యండి!

ఏ : శానా తప్పురా పుల్లిగా-నువ్వు వొఠి పిచ్చోడివి. ఈణ్ణాదిలే త్తే అడవుల్లోకి పోయి ముఠా గట్టుకొని నిన్నూ నన్నూ మనల్నందరినీ జంపటాని కొత్తాడు-ఇన్నా-ఇప్పుడే సంపే త్తే పీడా ఇరగడవుద్ది-

సా : [ఏకో నారాయణతో] ఈడితో ఏంది లేనిపోంది - [పుల్లయ్యతో] పుల్లిగా-మా పనికడ్డం-పో అవతలకి.

ఏ : సాంబా-ఉప్పు జూశావా? అది తిన్నోడి ఇసాసమే ఇసాసం! మన ఉప్పు-పుల్లి గాడింటో-ఇంకా ఒక బస్తా వుంది.

సా : రేపు ఏడన్నా కూత్తె.

ఏ : పేణాలు పోతాయి. ఆడు అబద్ధ వాడ్డు. సత్తె అరిచ్చంద్రుడు, ఈడి ముత్తాత ముత్తాతకి ముత్తాత. వొంశ గౌరం పోగొట్టు కొంటాడా?

సా : లేనిపోని తలనొప్పి! ఎందుకు ఆడు ఈడ?

ఏ : మనం జెప్పిన పని చేయకుండా పోయేంత తెలివి తక్కువదద్దమ్మ గాడు పుల్లిగాడు. అయినా అల్లుడికి తలకొరివి ఆడుండగా ఇంకోడు బెట్టటం ఏం నేయం?

కో : విన్నావా? బాగా విను. చెబుతాలే వింటారులే అన్నావే చూడు. ఏం చెప్పేవ్? ఏం విన్నారు? మామా ఇదింతే!

ఏ : ఈ కోటిగాడి కట్టెకి చివరి పనులు ఎవడి కులానికి తగ్గట్టుగా ఆడికి జరగాలి. నీతి, న్యాయమూ, ధర్మమూ ఏంకావాలి? మనం దప్పు సేత్తే దేవుడు మెచ్చొద్దూ! మనం సొరగంలో ఏం సంజాయిషీ చెబుతాం?

కో : ఏం మామా? ఉలకవు పలకవు - నాకంటె ముందుగా చచ్చావా ఏం, నా తలకొరివి పెట్టటానికి కూడా ఉండవా?

ఏ : (బెమ్మంతో) పుల్లిగాడికి అగ్గిపెట్టి ఇచ్చేయ్!

పు : అగ్గిపెట్టా? నా కెందుకు - వొద్దువొద్దు - దొరగోరూ నాతో ఈ పని చేయించొద్దు. మీకు పుణ్ణెం వుంటుంది.

ఏ : నా పుణ్ణెం నువ్ గూడా కొంచెం పంచుకోరా పుల్లిగా - తీసుకో (కోపంగా) తీసుకో.

పు : (భయంగా తీసుకుంటు-ఉ-ఉ)

కో : మామా! మీ బతుకులకు విలువలు లేవనీ, నువ్వొక మరబొమ్మ వనీ, ఎటు కీలుతిప్పితే అటు తిరుగుతావనీ ఇప్పటికయినా తెలి

సిందా? వ్యక్తిత్వం, నమ్మకం, బతుకు ప్రాణం, మీదంటూ మీకేది లేదని నీ కిప్పటికయినా - ఛీ ఛీ!

పు : అట్టా అనమాకరా! అంతా పయోడి దయ! మన చేతుల్లో ఏముందిరా?

కో : ఈ మెట్ట వేదాంతం కట్టిపెట్టు - నీ చేతుల్లో అగ్గిపెట్టి వుంది. అది మండుద్ది - కాలుసుద్ది.

పు : అంటే ఏందిరా?

కో : పక్కనే పెట్రోలుంది. వాళ్ళ ముఖాన కొట్టు. ముట్టించు. మండిచస్తే. మనం బతుకుతాం.

పు : నేయం మనల్ని బతకనియ్యదురా!

కో : (ఎగతాళిగా) న్యాయం!

ఎ : సాంబా! సంగతులు సరిగ్గా ఇనరో! కోటిగాణ్ణి పెట్రోలుతో స్నానం చేయించు.

సా : (కోటేసు వొళ్ళంతా పెట్రోలుతో తడుపుతున్నాడు)

ఎ : నీ సోకు మండిపోను! బట్టలు తీయకుండా పెట్రోలు స్నానం చేస్తున్నావు గందరా!

కో : సాంబిగా ఇక్కడ - ఇదిగో ఇక్కడ తడవలేదు తడపరా!

సా : ఏందిరా (కోపంగా)

ఎ : సుబ్బరంగా తడపరా! ఆడ గాలకుండా మిగిలిపోతే ఆన్నేయం సుకంగా సద్దామని అడి ఆసె! తడుపు!

పు : ఆణ్ణొదిలేసి పుణ్ణెం గట్టుకోండి దొరగారూ!

ఏ : (పుల్లయ్యతో) నీ ముకం మండ! నాకు పుణ్ణెం ఎక్కువయిపోయిం దిరా! ఇంత పుణ్ణెం ఏం జేసుకోనూ? (కోటేసుతో) ఏదీ ఎవుడికీ ఎక్కువగా ఉండరాదు గదరా! మా ఆస్తులు ఏం చేత్తానన్నా వేంది? ఈ పుణ్ణెం పల్లెంతా పంచేత్తావేంది?

కో : ఏకోనారాయణా!

ఏ : ఏమన్నావురా? (కోపంగా)

కో : ఏకో నారాయణా! ఏకోనారాయణా! అన్నాను.

పు : దొరగోరినట్టా అనొద్దురా!

కో : (ఎగతాళిగా) దొరగోరు! వీడు ఎవడికి దొర? నీకు - ఏరా ఏకో నారాయణా నువ్వెవడికి దొరవి - ఏరా -

ఏ : చమించేనురా - సావబోయే ముందు సరదా బాగా తీర్చుకోరా!

కో : నీ ఆస్తి మా రెక్కల కష్టం-నీ ఆస్తే కాదు-నీపుణ్యం-నీ పాపం-నీ తలకాయ పంచేరోజు ఎంతో దూరంలో లేదురా ఏకో నారాయణా!

ఏ : అది సరేగాని - నీళ్ళే సరీగ్గా దొరకని రోజుల్లో పెట్రోలు స్నానం నోచుకొన్న పుణ్ణెత్ముడివిరా! కారు తాదు రోడ్డుమీద పోయినట్లే నీ ప్రాణం-

కో : ఏకోనారాయణా! నువ్వేం చేసినా చెల్లుతుందనుకోకు. నువ్వు నన్ను కాల్చలేవు - చంపలేవు.

ఏ : ఏం నీ వొళ్ళు ఇనుమా?

కో : ఉక్కురా ఉక్కు! నువ్వేకాదు, నీ లాంటివాళ్ళు కోటి మంది మమ్మల్నేం చేయలేరు. ఇవాళ నేనొక్కణ్ణే కావచ్చు. రేపు వందలు, వేలు. నా కొడుకులు, ఆచారి మనుమళ్ళు, పుల్లయ్య కొడుకులు వేలు లక్షలు. నీ కొడుకే నీకు గోరీ కడతాడు. ఇది తప్పదు.

ఏ : (కోటేసుతో) అరిసి అరిసి అలిసిపోతే సుకంగా సావలేవు. నోరు మూసుకో - (బెమ్మంతో) వాడి నోరుముయ్. గుడ్డకుక్క, చస్తూ గావుకేకలు పెట్టొచ్చు.

బె : అణ్ణొదిలేత్తె పోలా!

ఏ : అణ్ణా! నీకు పేణంమీద ఆసెల్లేవా? నాకెంత నట్టం?

బె : ఆడి ముకం! ఆడేం జేత్తాడు?

ఏ : పగబట్టిన తాచుపామును వది లేస్తే ఏడంతస్తుల మేడెక్కి కాటేసుద్ది!

బె : కోరలు తీత్తె సరిపోలా! పేణం-

ఏ : ముయ్ నోరు - పాం తోక గొంతుకురి! కుక్కగుడ్డ.

బె : (కోటేసు దగ్గరకు పోయాడు)

కో : బెమ్మన్నా - నేను చావడం నీ కిష్టం లేదు. మామా అంతే! మీరు చేతగాని వాళ్ళు - మీరే నన్ను చంపుతారు.

బె : ఏం జెయ్యంరా? 

కో : మీ శక్తి మీకు తెలియటం లేదు. అదే తెలిస్తే ఏంజేయాలో వెంటనే తెలుస్తుంది.



సా : నోరు ముయ్యరా!

ఏ : అణ్ణరవనీయరా! చచ్చేముందు అయిగా అరిచ్చావనీ

కో : సాంబిగా! నామీద మీకు పగలేదు. నేను చచ్చినా బతికినా నీకు లాబం లేదు. నష్టమూ లేదు. నీ కూటికోసం నా గొంతు కోస్తావా?

సా : ఏడిశేవులేరా!

ఏ : నీ గొంతు కోయడురా! కాలుతుంటే చూస్తాడు.

కో : వాడొక్కడు - ఎక్కడయినా - ఏ వూళ్ళో అయినా - ఏకోనారాయణ ఒక్కడే - మనం నలుగురిమి. వాడు ఆడిస్తున్నాడు. మీ ముగ్గురూ వెర్రిగా ఆడుతున్నారు. మీరే తిరగబడితే వాడి నీడ కూడా బతికుండదు. మీరు వాడితో కలిస్తే మీ భవిష్యత్తుకు ఆశగా బతికే నన్ను నామరూపాలు లేకుండా చేస్తాడు. మీతో చేయిస్తాడు. చూస్తున్నారుగా. (సాంబడుతో) నీకు తెలియక, (బెమ్మంతో) నీకు తెలిసినా తప్పక (పుల్లయ్యతో) నీకు తెలివి లేక నన్ను కాల్చుకు తింటున్నారు. మీకు తెలివెప్పుడొస్తుందో-ఈలోగా ఎంత మంది చావాలో -

పు : ఊరుకోరా ఆశ్శేం జేత్తారోను!

కో : చంపటం కంటే ఎవుడైనా చేయగలిగిందేముంది?

ఏ : నువ్ బతికుంటే ఊరికి కట్టం - దేవుడికి పెమాదం - తొందర్లో సస్తే నీకు సుకం - (బెమ్మంతో) ఊ!

బె : (కోటేసు దగ్గరకు పోయాడు.)

కో : నేను చస్తానని బయం లేదు. మీకోసం బతుకుదామని ఆశపడ్డాను. నేను చావటం ఖాయం - కానీ మీరెట్లా చస్తారు? ఇవాళ నేను, రేపో మాపో ముగ్గురూ చావటమో, లొంగిచావటమో మీ ముఖాలు మీద వచ్చింది.

ఏ : ముయ్‌నోరు - కుక్కగుడ్డ.

బె : ఆణ్ణొదిలేద్దామండి!

ఏ : ఏడిసేవు! (మెడబట్టి తోశాడు)

కో : ఏకోనారాయణ! నీ చివరి గడియలు ఎంతో దూరం లేవు.

బె : (అరుగు ఎక్కాడు)

కో : నా వొళ్ళంతా కాలకముందు కట్లు కాలి తెగిపోయాయా - ఏకో నారాయణ - నువ్వు చచ్చావే!

బె : (నోట్లో గుడ్డ కుక్కుతున్నాడు)

కో : నా నోరు నొక్కలేరు. నా మాట ఆపలేరు. వచ్చేది మా కాలం-మా కాలం - కాలం - కాల-

ఏ : ఇక కాలు. (వీథిలోకిచూస్తూ జనంతో) చూసేరుగా మిడత ఎగురుడు. ఎట్టా కాలుద్దో సూడండి. వళ్ళు పయిగానకుండ మిడిసి వడితే పేణాలకే ముప్పు! ఎవుడన్నా ఎర్రేసాలేత్తే సచ్చేరే. ఇయాల నేను రేపింకొకడు, ఏకోనారాయణులు ఊరికొక్కడు ఎల్లకాలం ఉండాలి. తొర్రిమొర్రిగా తిక్కోళ్ళని తప్పుదోవ పట్టించి పెమాదాలుతెచ్చే ఎర్రెదవలంతా మిడతల్లా కాలి బూడిదై మాడిపోతారు జాగ్రత్త.

పు : (ఏకోనారాయణ కాళ్ళు పట్టుకొని) దొరగారూ - అణ్ణి వదిలిపెట్టండి. (ఏడుపు) మీకు పుణ్ణెం ఉంటుంది. దొరగోరూ!

ఏ : ఎందుకురా పుల్లిగా ఆడదానిలా ఏడుత్తావు-ముయ్‌నోరు. ఈ మాట ఎక్కడన్నా, ఎప్పుడన్నా, నోరెత్తావో ఈడికి బట్టినగతే నీకు_ వళ్ళు దగ్గరుంచుకో___

పు : అణ్ణొదలండి అణ్ణి బతకనియ్యండి - పోనీయండి.

ఏ : లెగవరా పైకి. అగ్గిపుల్ల గియ్. వాడికి ముట్టించు.

పు : నావల్ల కాదు దొరగారూ!

ఏ : గియ్ (మెడ పట్టుకొని పైకెత్తాడు)

పు : దొరా! (ఏడుపు)

ఏ : చుట్ట ముట్టించు కొన్నట్టేరా - ఊ! ఏదీ అంటించు.

పు : దొరగారూ ఆడు పిల్లోడు-లేతోడు-ఎఱ్ఱోడు, వదిలేత్తె మీ పేరు చెప్పుకొని బతుక్కుంటాడు. కాలిత్తే అన్నేయంగా సత్తాడు.

ఏ : ఆడసలు సచ్చేడు - నీతి తప్పేడురా - అంటే సచ్చినట్టే గందా! శవాన్ని ఎంతకాలం ఇంట్లో ఉంచుకొంటావురా! తల కొరివి పెట్టొద్దూ - అంతే - అంటించు!

పు : వద్దు దొరగోరూ - మీలాంటి పుణ్ణేత్ముు లు చెయ్యాల్సిన పని కాదిది-

ఏ : నోర్మూయ్‌రా! గియ్

పు : వద్దు.

ఏ : గియ్

పు : గియ్యలేను దొరగోరూ!

ఏ : గియ్!

పు : గియ్‌ను.

ఏ : గియ్‌వా ?

పు : గియ్‌ను!

ఏ : అంతేనా!

పు : అంతే దొరగోరూ!

ఏ : [పుల్లయ్య మెట గట్టిగా నొక్కుతూ] అంతేనంటావా [నొక్కి-నొక్కి- అడిగాడు]

పు : అమ్మా!

ఏ : అంతే గదూ!

పు : అమ్మా!

ఏ : గియ్!

పు : నన్నొదలండి దొరగారూ-మీకు పుణ్ణెం.

ఏ : గియ్!

పు : దొరా!

ఏ : ముయ్‌నోరు! గియ్.

పు : నన్ను సంపొద్దు - గిత్రా!

ఏ : అలారా దారికి. గియ్‌రా! ఒక దుర్మార్గుణ్ణి చంపి ఊళ్ళోవాళ్ళకి మేలు చేసేపని జనం కతలు కతలు సెప్పుకొంటారు?

పు : అల్లుణ్ణి సేజేతురా సంపుకొన్నానని ఉరంతా ఉరితీత్తే పల్లె పాతేత్తదిలా-

ఏ : [పుల్లయ్య చేతులు పట్టుకొని అగ్గిపుల్ల తీయించాడు].

పు : కోటిగా నువ్ చెప్పినట్టింటే ఎంత బాగుండేదిరా! నాకు తెలివి లేదురా! దద్దమ్మనిరా! సన్నాసిని - చవటని - మొద్దుని - నువ్వన్నట్టు కుక్కనిరా! - తండ్రీ కుక్కని! - నిన్నెవురు రచ్చిత్తార్రా? ఎట్టారా నిన్ను కాపాడటం?

ఏ : గియ్-

పు : ఏకో నారాయణా! నువ్వెంతో కాలం బతకవ్ నీకు నాశనం-

ఏ : (పుల్లయ్య చేతులు పట్టుకుని) గియ్- [ముందుకు నడిపి] మా జాగా గీసేవురా - [ముందుకు తోస్తూ] నీ అల్లుడికి నువ్వే తలకొరివి పెట్టే పుణ్ణెం యెంత అదరుట్టం [పుల్లయ్యకు ముందుకుతోశాడు.]

పు : (కోటేసుమీద పడ్డాడు) (రంగస్థలమంతా ఎర్రటి వెలుతురు).

[తెర పడింది]

[తెరలో]

[గావు కేక] - కోటిగా - తండ్రి కోటిగా

నిశ్శబ్దం.

# నిర్భయం

పాత్రలు

1. రాజారావు
2. లెక్చరర్
3. శీను
4. శేఖర్
5. రాము

రంగస్థలం

కాలేజీ కాంపౌండు

తెర లేచేసరికి రాజారావూ లెక్చరరూ ఉన్నారు

లెక్చరర్ : రాజా ! ఎందుకు ఒంటరిగా కూర్చున్నావు. ఏడుస్తున్నావా ? పెదాలు అదురుతున్నాయే - ఏముంది? పరీక్ష బాగా రాయలేదా?

రాజారావు : బాగా రాశాను మేడమ్. [వెక్కిళ్ళు]

లె : నాకు తెలుసు. నీకు మంచి మార్కులు వస్తాయి. ఇంజనీరింగ్‌లో చేరతావు. ఎందుకేడుస్తున్నావు. ఎవరికయినా బాగాలేదా ? ఇంటి దగ్గర్నుంచి డబ్బు రాలేదా ?

రా : ఏంలేదు మేడమ్ [వెక్కిళ్ళు]

లె : ఎవరితోనైనా గొడవపడ్డావా ? వార్డెన్ తిట్టాడా ? క్లాసుమేట్సు ఏమైనా అన్నారా ?

రా : ఊఁ! రాము శేఖర్ శీను; - నేను వాళ్ళనేమీ అనలేదుకదా మేడమ్. వాళ్ళు నన్నెందుకనాలి?

లె : వాళ్ళను నేను దండిస్తానులే! ఇంతకీ ఏమన్నారు ?

రా : "వీడు మాదిగవాడు. హరిజన హాస్టల్లో తింటున్నాడు" అన్నారు మేడమ్.

లె : అందుకా నువ్ ఏడ్చేది? - నువ్వు హాస్టల్లోనేకదా తింటూవుంది.

రా : అవును.

లె : నీది మాదిగకులమేకదా !

రా : అవును.

లె : వాళ్ళు నిజమేకదా అన్నారు - అబద్ధమేమీ అనలేదే - ఏడవటం దేనికి ?

రా : అని ఎగతాళిగా నవ్వుకొంటున్నారు మేడమ్.

లె : వాళ్ళు నవ్వుకొంటే నీకేం ?

రా : నాకవమానం.

లె : వాళ్ళనీ అను. నువ్వూ నవ్వు. నన్ను మాలలెక్చరరు అను నేనేమీ అనుకోను.

రా : వాళ్ళకేం అవమానముండదు. పైగా ఎగతాళిగా నవ్వుతారు. కొట్టబోతారు. మీరంటే వేరు.

లె : నువ్వు బాధపడతావని తెలిస్తే, బాధ పెడతారు. ఏడుస్తావని అనుకొంటే ఏడిపిస్తారు. తన్నులు తింటావనుకొంటే తంతారు. ఈ లోకమే అంత - దిక్కుమాలిన వాళ్ళంటే అందరికీ లోకువే!

రా : అందుకే మేడమ్ దిగులు.

తె : నువ్వు దిగులు పడవనుకో! నీ జోలికెవరూ రారు. నువ్వు నవ్వు తావనుకొంటే ఎవడూ నిన్ను ఏడిపించలేడు. నువ్వు తంతావనుకొంటే ఎవడూ నిన్ను తన్నటానికి రాడు. అంటే నువ్వు నిర్భయంగా ఉండాలి.

రా : అదికాదు మేడమ్

తె : ఏమీ చెప్పొద్దు- నవ్వీన నావచేనే పండుతుంది- బాగా చదువు।
(లైట్లు ఆరిపోయి వెలిగాయి. అదే రంగస్థలం)

శ్రీ : రాజారావు వస్తున్నాడురోయ్

శ్రే : వాళ్ళ నాయన గొడ్డు గోస్తాడురా.

రా : వాడు వింటూ వున్నాడు.

శ్రీ : వాటి తోలు కూడా వొలుస్తాడురా.

రా : తోలూను తాడురా ?- ఏం కంపురా నాయనా- అది వీడి దగ్గరా ఉంది-పాడుకంపు,

శ్రీ : వీడు ఏడవడేమిటిరా ?

శ్రే : కనుక్కుందాం ఉండండిరా- - నువ్వేడవేందిరా రాజిగా-

రా : ఎందుకూ ఏడవటం- మీరనేది నిజమేగా !

శ్రీ : అమ్మ వీడికెంత తెలివి వచ్చిందిరా !

శ్రే : నీకెందుకురా చదువూ చట్టుబండలు- కులవృత్తి చేసుకోకూడదూ।

రా : చేసుకోవచ్చు. వల్లెకుపోయి కాదు. పట్టణంలోనే. చదువు మానేసి కాదు. చదువుతూనే- మీలాంటి పశువుల గొంతుకోసి తోలూని నీతి నేర్పుదామని వుంది.

రా : ఏమిటిరా నువ్వనేది?

రా : మీ తోలు చెప్పులు కుడదామనిరా.

శే : రా అంటావంటరా!

రా : నువ్వు మానేస్తే నేనూ మానేస్తారా!

శే : నిన్నిక్కడ తంతే నీకెవర్రా దిక్కు!

రా : ఇదిగో చాకు.

రా : చాకుతో ఏం చేస్తావు?

రా : పీకలు కోస్తాను. మేమసలే గొడ్లు గోసేవాళ్ళం - ఊని చెప్పులు కుడతాం. నాకీమధ్య చెప్పులరిగిపోయాయి. ఎవడు తన తోలు నా చెప్పులకి దానం చేస్తాడో చెప్పండి. రండి. ముందుకు రండి. పరిగెడతారేమిటిరా!- ఒరే మిమ్మల్ని ఒరే అంటున్నారా!

(లైట్లు ఆరిపోయి వెలిగాయి.
అదే రంగస్థలం)

లె : రాజా నీకెందుకీ చాకు?

రా : నన్నేమన్నా అంటే వాడి గుండెలు చీల్చటానికి.

లె : వాళ్ళూరుకొంటారా? నిన్ను ఏడిపించారనే నీకింత కోపం వచ్చిందే- వాళ్ళని చంపుతానంటే వాళ్ళకెంత కోపం రావాలి? వాళ్ళేమన్నా చేస్తే?

రా : నాకేం చింతలేదు.

లె : మరి నువ్వేం సాధించినట్లు?

రా : కులం పేరుతో ఎవడూ ఎవణ్ణీ ఏడిపించడు.

లె : అని అనుకొంటున్నావు. అది నువ్వు చూశ్శేవు.

రా : చావు నాకు భయంలేదు.

లె : నువ్వు పిరికివాడివి.

రా : నేను నిర్భయంగా చావగలను.

లె : నిర్భయం చావటానికి కాదు, బ్రతకటానికి కావాలి. ఏ ఆయుధమూ నిన్ను బతికించదు. ప్రతి ఆయుధమూ నిన్ను చంపుతుంది. చాకు పిరికివాడి ఆఖరి ఆయుధం. నువ్వు పిరికివాడివి కారాదు. మా రాజా పిరికివాడు కాడు.

రా : నాకేం పిరికితనం లేదు మేడమ్.

లె : చాకు నిన్ను రక్షించలేదు. అది లేకపోతేనే రక్షణ. అది నీ దగ్గరున్నంతసేపూ నీకు భయం. నువ్వు పిరికివాడివి ఇది. నీ దగ్గర లేకపోతేనే నీకు నిర్భయం. నీకు ధైర్యం.

రా : ఇది వాళ్ళని భయపెట్టటానికి - నాకేం భయం?

లె : చాకుతో వచ్చేది చాకుతో పోతుంది. నీతో వచ్చే భయం నీతో పోతుంది. ఏ విధంగా భయం కలిగినా అది తొలగిపోతుంది. భయమే అక్కరలేదు. భయపెట్టేవాడు భయపడుతూ ఉంటాడు. వాళ్ళకి ఆనందం పంచు, నువ్వు ఆనందించు.

రా : వాళ్ళు ఆనందించాలంటే నేను ఏడవాలి.

లె : నువ్వు ఏడవగూడదు. నువ్వు మంచి మార్పులు తెచ్చుకొంటే నీకూ ఆనందమే - మాకూ ఆనందమే.

రా : ఆనందం కాదు ఏడుపు - నాకు మంచి మార్పులు వస్తే వాళ్ళకు కడుపుమంట

లె : తమ్ముణ్ణి చూసి అన్నలు -

రా : నేను తమ్ముణ్ణి కాను!

లె : అన్నకు మేలు జరిగితే తమ్ముళ్ళు -

రా : వాళ్ళానందించరు!

లె : నువ్వానందించు. వాళ్ళు నీ అన్నదమ్ములనుకొని నువ్వు సంతోషించు.

రా : వాళ్ళకిష్టం ఉండకపోతే!

లె : నీకేం నష్టంలేదు. నువ్వు ప్రేమించు - వాళ్ళు ఆనందిస్తారు. వాళ్ళు ప్రేమించకపోయినా నీకు చింతలేదు.

రా : మేడమ్! మీ పాఠం అర్థమయినట్లు మీ మాటలు అర్థంకావు.

లె : అవి పుస్తకాలు. ఇది జీవితం, అర్థం కావలసింది ఇది. ఆ చాకు ఇలాతే.

(లైట్లు ఆరిపోయి వెలిగాయి.
అదే రంగస్థలం)

శే : వాడొస్తున్నాడురా?

రా : రానీ___

శే : దగ్గర చాకు ఉందో ఏమో

రా : లేదు-మేడమ్ తీసుకుపోయింది.

రా : ఏరా మనకి గంట మేడమ్ క్లాసా?

శే : మెడకోస్తావా - (దెబ్బ-)

రా : ఉండరా!

రా : తోలూనుతావా (దెబ్బ)

రా : ఉండండిరా! నేనిప్పుడలా అనుకోవడం లేదు.

శీ : అప్పుడనుకొన్నావుగా - తన్నండిరా వీణ్ణి- (దెబ్బ)

రా : ఆగండిరా! నన్ను కొట్టొద్దు. మీ మీద నాకు కోపంలేదు.

శే : మాకుంది. (దెబ్బ)

రా : నిజం చెబుతున్నాను. నావల్ల మీకేం కీడులేదు. నేను మిమ్మల్నేం చేయను.

శే : ఏంచేస్తావురా!

రా : మీరంటే నాకిష్టం.

రా : వీడు ఏడవడేంరా!

శీ : నెత్తురొస్తూ వుందిరా!

రా : అదిగో మేడమ్.

లె : (లెక్చరరు ప్రవేశం) ఏమయింది రాజా?

రా : వాళ్ళు కొట్టి పోయారు.

లె : ఎందుకు?

రా : అప్పుడెప్పుడో నేను వాళ్ళను భయపెట్టాను కదా-అందుకు.

లె : ఆ కర్చీఫుతో ఆ రక్తం మీద తుడిచి కట్టు కడతానుండు. అయ్యో రక్తం కారిపోతూవుంది,

రా : ఫరవాలేదు మేడమ్. మా తాత ముత్తాతలు చాలా రక్తం ధార పోశారు.

లె : ప్రిన్సిపాల్‌కి రిపోర్టు ఇద్దువుగానిరా!

రా : అమ్మా!

తె : రాజా!

రా : వద్దమ్మా! వాళ్ళు నా అన్నదమ్ములు. మీ బిడ్డలం!

లె : రాజా! నువ్వు నిజంగా మా రాజావా? మునుపటి రాజావా?

రా : నేను పిరికివాణ్ణా అమ్మా?

లె : లేదు రాజా! నువ్వు ధైర్యవంతుడివి. నిజంగా నీదే ధైర్యం.

రా : చూడమ్మా వినకుండా ఎన్ని దెబ్బలు కొట్టారో! దెబ్బలకోసం కాదు దిగులు - విననందుకు.

లె : అప్పుడు కర్రో కత్తో లేదే అనుకున్నావా?

రా : అనుకోలేదమ్మా - అది మీకు ఇచ్చేశాను కదా!

లె : అయ్యో రక్తం కారిపోతూ వుంది.

రా : అమ్మా! పోనీ! ఈ రక్తం రంగు మారదు.
(లైట్లు ఆరిపోయి వెలిగాయి. అదే రంగస్థలం)

రా : ఆ తల్లికి ఆ నలుగురే ఎందుకు పుట్టారు? మనమంతా ఎందు పుట్టలేదు?

శ్రీ : అది సినిమా కథరా బాబు!

రా : ఈ పూళ్ళో ఈ లక్షమందే ఎందుకుంటున్నారు? మనం ఈ ముఖాలే ఎందుకు చూస్తున్నాం?

శే : ఎవర్ని అడిగితే జవాబు చెప్తార్రా?

రా : మనం అందరం ఈ ఊళ్ళోనే ఎందుకు కలుసుకొన్నాం? మనం వేరేవూరు ఎందుకు పోలేదు? వేరేవాళ్ళు మన వూరు ఎందుకు రాలేదు?

రా : నీ కిదేం పిచ్చిరా!

శే : పోనీలే, ఆ పట్టేదేదో పరీక్షలు అయినాక పట్టింది.

శే : ఈ పిచ్చి సినీమాకి వద్దురా అంటే వినకపోతిరి మీరు.

శే : మా యింట్లో భోంచేద్దాం అందరం—

రా : మనం ఏడిపించినా, ఏడ్చినా, కొట్టుకొన్నా, తిట్టుకొన్నా—

రా : సినీమాలో వాళ్ళలాగా అన్నదమ్ములం.

లె : (దూరంనుంచి) ఏమిటి అన్నదమ్ముల వ్యవహారం—(దగ్గరగా) రాజా నువ్వా? మీరంతా కలిసి—

శే : ఏంలేదు మేడమ్!

రా : మేం వస్తాం మేడమ్.

శే : వస్తాం రాజా.

లె : సరే!

రా : వెళ్ళిరండి!

లె : వాళ్ళతో నువ్వు చాలా ప్రేమగా జీవించావు. అంతేనా?

రా : ప్రేమించాను. మీ దయ అమ్మా. వాళ్ళు నన్నొదిలి ఉండలేరు. మీరే రాకపోతే నన్ను పోనీయరు.

లె : ఈ రెండేళ్ళలో నువ్వెంతగానో ఎదిగిపోయావు రాజా. ఏడ్చే, భయపడే, పారిపోయే పసివాడివి, ప్రేమించే పెద్దవాడివయ్యావు.

రా : అమ్మా అది మీరు మాకు నేర్పిన జీవితపాఠం- కులం పేరుతో ఎంత మంది అన్నదమ్ములు వణికిపోతున్నారో - వినలేక ఎంతమంది

రాక్షసులవుతున్నారో-తుపాకీ తీసుకొంటున్నారో-బలవుతున్నారో-ప్రతీకార వాంఛతో ఎన్ని బ్రతుకులు పగిలి బ్రద్దలయి పోతున్నాయో ! వీళ్ళందరికీ మీలా తోవచూపే వాళ్ళెవరమ్మా!

లె : రాజా భయపడి, భయాన్ని జయించావు. కోప్పడ్డావు. కోపాన్ని జయించావు. ద్వేషించలేదు. ప్రేమించావు. నువ్వు అభివృద్ధికి వస్తావు రాజా.

రా : ఈ రెండేళ్ళలో ఎంత జీవితం చూశానో-ఎవరికుంది ఇన్ని ములుపుల జీవితం - ఇంత అనుభవం. వాళ్ళవన్నీ వడ్డించిన విస్తళ్ళు. వాళ్ళకెవళ్ళకు హృదయం ఇంతగా కాలలేదు. మండలేదు. శ్మశానం కాలేదు. నేనెంత అదృష్టవంతుణ్ణి!

లె : మరి ఈ పొద్దు నీ నుదుటే ఎందుకు పొడిచింది?

రా : ఎందుకో చెప్పమ్మా !

లె : నేనుకాదు రాజా-నువ్వే చెప్పాలి-నువ్వేచెప్పాలి-నాకేకాదు. ఈ లోకానికి నువ్వే చెప్పాలి. ఇవాళ-కాకపోతే రేపు-ఎప్పుడో ఒకనాడు నువ్వే చెప్పాలి. రాజా నువ్వే చెప్పాలి. నీ రక్తం రంగు మారదు.

(తెర)

# సమానత్వం

పాత్రలు :
1. మాధవయ్య
2. కృష్ణయ్య
రంగస్థలం :
డ్రాయింగు రూం

కృష్ణయ్య : మాధవమ్మగారూ; మీరన్నీ చదువుకొన్న పెద్దలు - మీకు తెలియందిలేదు-వేదాలు వేదాంగాలు పురాణాలు అన్నీ మీకు కంఠోపాఠంగా వచ్చుగదా - నన్నెందుకండీ అంటరాని వాడని అంటారు.

మాధవయ్య : కిట్టిగా ఎందుకంటారో నువ్వే చెప్పి ఏడవరా!

కృ : నిన్ను గోస్తే నెత్తురు, నన్ను గోస్తే నీళ్ళు రావు. నువ్వు దినే కూడు నేను దినేకూడూ నేలతల్లే పెట్టింది. పీల్చేగాలి, త్రాగే నీరు ఒక్కటే! ఎవర్ని గాల్చినా అదే నిప్పుతో. ఎవర్నిలబడ్డా అదే ఆకాశం కింద. మరేందీతేడా ?

మా : పిచ్చివాడ ! పంచభూతాలు అందరికి సమానమే - అయితే నీ యిల్లు వేరు నా యిల్లు వేరు. నీ బావీ నా బావీ ఒకటికావు. నాది వూరు నీది వాడ. మన కులాలు వేరు. ఎంతతేడా వుందో చూడు,.

కృ : అందరమూ ఆ దేవుడి పిల్లలమేనాయె - ఎందుకీ తేడాలు అనేకాదా నేననేది ?

మా : మీరీమధ్య మహమ్మదుకో ఏసుక్రీస్తుకో కొడుకులు అయిపోయారు కదూ-అదే మతం మార్చుకొన్నారుకదా!

కృ : అదేదో మీరూ చేశారుగా - మార్చుకోవటంలో మనందరం సమానమేనాయె.

మా : ఇంకా తేడా ఎందుకంటావు? - అవునా - మీరు మురికి వాళ్ళురా- ఇల్లు వళ్ళు పనులు అలవాట్లు అన్నీ మురికివి-

కృ : శుభ్రంగా ఉంటే ఒకటేనంటారు మీరు. అంతేనా?

మా : కావచ్చు!

(లైట్లు ఆరిపోయి వెలిగాయి. అదే రంగస్థలం)

కృ : మాధవయ్యగారూ!

మా : ఏం కృష్ణా!

కృ : చూడండి నా వళ్ళు - మా యిల్లు - నా పనులు - మా అలవాట్లు- చూశారుగా-

మా : చూశాను - అయితే?

కృ : నేను శుభ్రంగా ఉన్నాను కదా!

మా : ఉన్నావు - అయితే?

కృ : నన్నెందుకు అంటరానివాడని అంటారో చెప్పండి. కుండ బద్దలు కొట్టినట్లు చెప్పాలి.

మా : అదే ఎందుకంటోరా నువ్వే చెప్పు!

కృ : నాకు తెలివిలేదా? భక్తి లేదా? లోకం తెలియదా? నేను మనిషిని కాదా? పశువునా? ఎందుకు నేను అంటరానివాణ్ణి?

మా : నీకేం తెలివి? చదువే లేదు. భక్తికేం బ్రహ్మాండంగా ఉంది. గంగిరెద్దులా తలకాయ పూపటంకాదు. అడిగినవాటికి తలకాయ ఇవ్వటంకాదు - తెమ్మంటే ఎవడితలో తేవటంకాదు. నీతి ఉండాలి. నియమం ఉండాలి. నిష్ఠ ఉండాలి. నీకేం ఉందో చెప్పు! నీకు భార్య ఒకతి చాలదు. నీ తిండికి హద్దూ పొద్దూ ఉండదు. తాగుడికిక అంతే లేదు. దీంతో నీ తెలివితేటలు మట్టి గొట్టుకుపోతాయి. నువ్వెందుకూ పనికిరావు. నిన్ను తాకితేనే మహాపాపం. పంచ మహా పాతకా లంటుకొంటాయి. నిన్ను చూస్తేనే రోత. అసహ్యం. పో అవతలికి——

కృ : నేను నీతిగా ఉంటే -

మా : అప్పుడు చూద్దాం.

(లైట్లు ఆరిపోయి వెలిగాయి. అదే రంగస్థలం.)

కృ : మాధవయ్యగారూ!

మా : చెప్పు కృష్ణయ్యా!

కృ : నేనేం చదువుకొన్నానో చూడు - ఏం ఉద్యోగం చేస్తున్నానో గమనించు - ఆమె నా భార్య! ఒక్కతే! వీళ్ళు నా పిల్లలు-చూడు ఎంత ముచ్చటగా ఉన్నారో - నేను తాగటం లేదు. నా పూజా పురస్కారాలు చూశారు కదా! నాకు సోమరితనం లేదు. నేను లోకానికి ఇవ్వగలిగినంత ఇస్తున్నాను. నా నీతి నియమాలు తెలిసినాయి కదా!

మా : కృష్ణయ్యా! అదంతా అవును నిజమే.

కృ : నా కెవరికంటేనూ తెలివితేటలు తక్కువలేవు. ఎందులోనూ ఎవరికంటెనూ తీసిపోను.

మా : అవును నిజమే.

కృ : నే నెవరికంటేనూ తక్కువ వాణ్ణి కాను.

మా : అవును నిజమే!

కృ : నా వ్యక్తిత్వం ఒక పరిపూర్ణ వికాసం పొందింది.

మా : అవును నిజమే!

కృ : మరి నన్నెందుకు అంటరానివాడ నేది?

మా : ఈ లోకం ఇప్పుడు తిరుగుతున్న కేంద్రం, ఇరుసు, చక్రం, అంతా డబ్బు. ధనం ఇప్పుడు జనం ప్రభంజనం లోకం. నువ్వు ధనహీనుడివి. అంటే గుణహీనుడివి. కాబట్టి కులం లేనివాడివి. ధనవంతుడే కులవంతుడు. వాడే పిలవబడేవాడు. తలవబడే వాడు. స్పృశ్యుడు. మిగతావాళ్ళు అస్పృశ్యులు. అంటే తెలుసు కదా! డబ్బులేని నువ్వు అంటరానివాడివి.

కృ : నేనే ధనవంతుణ్ణయితే-

మా : కానీ -

(లైట్లు ఆరిపోయి వెలిగాయి. అదే రంగస్థలం.)

కృ : మాధవయ్యగారూ!

మా : ఏమండీ కృష్ణయ్య గారూ!

కృ : నీకన్నీ తెలుసుకదా!

మా : కాదన్నానా?

కృ : అది నా పొలం. బంగారం పండుతుంది-

మా : కాదన్నానా?

కృ : అవి నా పరిశ్రమలు. బంగారం గుడ్లుపెట్టే బాతులు-వీటిని నేను కోసుకు తినటం లేదు. గుడ్లు పెట్టనిస్తున్నాను.

మా : కాదన్నానా?

కృ : అవి నా యిళ్ళు- కార్లు- ఆస్తులు. వాళ్ళంతా నౌకర్లు, డ్రైవర్లు, ప్యూన్లు.

మా : కాదన్నానా?

కృ : అయినా నేనెందుకు అంటరానివాణ్ణి?

మా : ఎవరన్నారామాట!

కృ : అందరూ!

మా : నేను నమ్మను.

కృ : రండి నాతో- ఇదీ నా దినచర్య- చూశారుకదా! మరి ఎందుకింత మంది, ఇన్నిచోట్ల, ఇంత ఘోరంగా, క్రూరంగా ఇంత అన్యాయంగా నా అంటరానితనం గుర్తు చేశారు?

మా : అవును!

కృ : ఏమిటి ఔను?

మా : అంటరానివాడివి అనలేదు కాని- నీ అంటరానితనం నీకు గుర్తు చేశారు. మహా సున్నితంగా గుర్తు చేశారు. తేనె పూసిన కత్తితో పొడిచి గుర్తు చేశారు. అవును-

కృ : అదే! ఎందుకిలా జరిగింది?

మా : మనలో ఐకమత్యం లేదు. పోనీ మీలోనూ లేదు. మీరు కలసి బతకలేరు. ఒక్క మాట లేదు. ఒక్క బాట లేదు. ఒక్క తాటి మీద నడవలేరు. మీకు రాజకీయంగా శక్తిలేదు. ఆశ లేదు. అధికారం లేదు. మీరిప్పుడు కొన్ని కోట్ల ఒకట్లు- మీరెప్పుడూ కొన్ని కోట్లు కాలేరు.

కృ : అయితే-

మా : అప్పటి మాట.

(లైట్లు ఆరిపోయి వెలిగాయి. ఆదే రంగస్థలం)

కృ : మాధవయ్యా!

మా : అయ్యా కృష్ణయ్యగారూ! నమస్కారం.

కృ : బాగున్నావా?

మా : ఆహాఁ! తమరి చలవ - తమరు పరమ దేశభక్తులు.

కృ : ఆరోగ్యం అదీ బాగుందా? పిల్లా జెల్లా క్షేమమే కదా!

మా : తమ దయవల్ల- ఎక్కడ చూసినా తమ శిలావిగ్రహాలే!- కాంస్య విగ్రహాలే - సిమ్మెంటు విగ్రహాలే-

కృ : అది సరేలేవయ్యా - మా రాజకీయం-

మా : దానికి తిరుగుందా? పంచాయతీ ప్రసిడెంట్లూ మీరే!

కృ : అంతేనా?

మా : సమితి అధ్యక్షులూ మీరే!

కృ : అంతేనా?

మా : జడ్ పి. చైర్మన్లూ మీరే!

కృ : అంతేనా?

మా : యమ్మెల్యేలు, యమ్మెల్సీలు, యం.పీ.లు మీరే!

కృ : అంతేనా?

మా : రాష్ట్ర మంత్రులు, కేంద్రమంత్రులు, ముఖ్యమంత్రులు అన్నీ మీరే!

కృ : మాధవయ్యా - రాజకీయంగా ఇంత ఔన్నత్యం సంపాదించాం కదా మేము - ఇంకా ఎందుకు మమ్మల్ని చూచిన వెంటనే మా అంటరానితనం గుర్తు చేస్తూవుంది లోకం?

మా : మీరు, రాజకీయంగా ఔన్నత్యం మీరు సంపాదించలేదు. మేం ఇచ్చాం. దయాధర్మం. దానం. మీరు పొందలేదు. మేం అందించాం.

కృ : మరిప్పుడేం చేయాలి?

మా : నాకు తెలియదు.

కృ : నిజంగా తెలియదా!

మా : నిజంగా తెలియదు.

కృ : మరేం చెయ్యాలి?

మా : లోకాన్ని చూచిరండి. లోకం లోపలికి దిగి చూచిరండి. పైపైన వద్దు, అరలు పొరలు తొలుచుకుపొండి. పోయి విజయులై రండి.

కృ : అప్పుడు చెప్తారా!

మా : అప్పుడు మీరే చెప్పాలి మాకు.

(లైట్లు ఆరిపోయి. వెలిగాయి. అదే రంగస్థలం.)

మా : వచ్చావా కృష్ణయ్యా! రా బాగుందా లోకం?

కృ : దానికేంలే మాధవయ్యా! నీ ఆరోగ్యం బాగుందా?

మా : మన ఆరోగ్యాలకేం? నేలంత ఆరోగ్యం! - ఏమిటి విశేషాలు ఎంత మంది హరిజనుల్ని చూశావు?

కృ : చాలా మందిని.

మా : గొప్పగొప్ప ఉద్యోగాలలో ఉన్న హరిజనులు ఏ బాదరాబందీ లేకుండా ఉన్నారా?

కృ : లేరు.

మా : న్యాయం చెప్పే జడ్జీలు?

కృ : ఈ వలయం తప్పుకోలేకుండా ఉన్నారు.

మా : సైంటిస్టు?

కృ : టెస్ట్ ట్యూబులో పడిపోయాడు.

మా : డాక్టరు, ఇంజనీరు?

కృ : సేవలో ఉన్నారు.

మా : సైనికుడు.

కృ : కులం మర్చిపోయాడు.

మా : అంతేకాని హరిజనుణ్ణి కాదనలేదు.

కృ : హరిజనుడే - కులం మర్చిపోయాడు.

మా : కొంత మేలే! · మరి ప్రొఫెసర్?

కృ : ఆలోచిస్తూ కూర్చున్నాడు.

మా : నువ్వేం చేశావ్?

కృ : లేచి వచ్చేశాను.

మా : నీకు అసక్తికరంగా ఏ హరిజనుడూ కనిపించలేదా?

కృ : చాలామంది కనిపించారు-ఒకడు హత్య చేస్తుంటాడు.

మా : సరే! ఏమిటి ప్రత్యేకత?

కృ : అతను చంపినవాళ్ళ కులాలు అతడికి తెలియదు.

మా : గొప్పవాడే! ఇంకా?

కృ : ఒక ఫ్యాక్టరీ యజమాని ఉన్నాడు.

మా : అతడి గొప్పేమిటి?

కృ : వర్కర్సుని మాల మాదిగలని తిడతాడు.

మా : ఎందుకలా తిట్టటం?

కృ : అదే అడిగా-

మా : ఏమన్నాడు?

కృ : అలా వాళ్ళు నన్ను తిట్టకుండా ఉంటానికి అన్నాడు తిట్టిం తిట్టే తిట్టాలంటే వాళ్ళకి సిగ్గు కదా - కొత్త తిట్టయితే అతనికి ఫరవా లేదు. ఒకతను సారాయి తాగుతూ కనిపించాడు. ఏం కులం అన్నా.

మా : ఏమన్నాడు?

కృ : సారాయికి కులం లేదన్నాడు.

మా : గొప్ప సత్యం చెప్పాడు.

కృ : ఒకడికి పదిమందిభార్యలు! వేరువేరుకులాలవాళ్ళని కట్టుకొన్నాడు.

మా : బాగా ధనవంతుడా?

కృ : ఇంకా నయం - భిక్షాధికారి. పరమసోమరి.

మా : వాళ్ళంతా వీణ్ణెందుకు పెళ్ళాడారు?

కృ : అలాగే అడిగాను-వాళ్ళనే అడగమన్నాడు. ఒకడికి గంపెడు పిల్లలు.

మా : మనుషులే!

కృ : ఆఁ. ఎలా పోషిస్తావు అని అడిగా- ఏమన్నాడో తెలుసా? -నారు పోసినోడి నీటితో___

మా : నువ్వు నీరుగారి పోయుంటావుకదా!

కృ : మళ్ళీ అడుగుతున్నావా?- ఏంరా దున్నినట్లే దున్నుతున్నావు- చేనేమో చెక్కు- చెదరదు అంటే దున్నినట్లే దున్నాలి - చేనోడే చెడాలి అన్నాడు. అనగానే 'ఏంరా హరిజనుడివా' అన్నాను.పగ్గం వదిలి మీదికొచ్చి 'శివజనుణ్ణి' అన్నాడు. వీడెవడురా బాబూ అనుకొని ఇటు వచ్చేశాను. ఇంతకీ మాధవయ్యా ఈ శివజను డెవడు?

మా : ఈ లోకంలో ఒక మనిషి!

కృ : మాధవయ్యా ఇంత లోకం తిరిగి వచ్చింతర్వాత నాకు పిచ్చిగా ఉంది.

మా : నువ్వేం తిరిగావు? ఇంకా ఉంది హరిజనలోకం - అదిసరేగాని ఎందుకూ వీళ్ళని అంటరాని వాళ్ళంటారు?

కృ : అదిసరే గాని - మాధవయ్యా - నువ్వెన్ని అవతారాలెత్తావు?

మా : నేనా?

కృ : అవును - అదే - దశావతారాలుకదూ! నీ అవతారమేకదా ఈ కృష్ణయ్య - నేనెన్ని అవతారా లెత్తాను. పదహారువేలో ఎన్నో! మీరిన్ని అవతారాలు ఎందుకెత్తారు?

మా : దుష్టుల్ని శిక్షించడానికి శిష్టుల్ని రక్షించడానికి.

కృ : దుష్టులూ శిష్టులూ కాని ఈ అమాయిక హరిజన జాతిని రక్షించ డానికి నేనింకెన్ని అవతారాలు ఎత్తాలి?

( తెర )

# న్యాయం

పాత్రలు

1. రామయ్య
2. సుందరరావు
3. శంకరరావు
4. లలిత

రంగస్థలం
పూరిపాక ముందు మంచం

రామయ్య : సుందిరిగా - ఒరే సుందిరిగా - ఏందిరా ఈ పాడు నిదర- లేరా లే - లేవవేరా - బారెడు పొద్దెక్కింది. పిల్లలు బళ్ళో కెళ్ళి పోయారు. ఏందిరా ఆ ముసుగు - మళ్ళీ ముసుగు తన్ని పొడు కుంటావు! లేస్తావాలేదా! ఒరేయ్ నా తిక్క నీకు బాగా దెలియదు- చెబుతున్నా నీ యిష్టం - లేవవేందిరా——

సుందరరావు : అప్పుడే ఏంతొందర నాన్నా - నువ్వూ కొంచెం పడుకో-

రా : ఇదేరా గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించిందనటం - నన్ను నిదర బొమ్మంటావా? ఎంత సేపు? ఎన్నాళ్ళు? తెల్లారిం తరవాత నిద్రేంటిరా? నా వల్లగాదురా!

సుం : అప్పుడే నిద్రలేచి నేనేం చేయాలి? - నన్ను పడుకోనియ్ - కావా లంటే నువ్వు నిద్రలేచి - నీ యిష్టం -

రా : నా యిష్టం ఏం జరుగుద్దిరా - సుఖానున్న పేణాన్ని దుక్కాన పడేశారు కదరా మీరంతాకలిసి - మోసపోయానురా మిమ్మల్ని నమ్మి——

సుం : ఏందేంది? ఏంది నువ్వనేది?

రా : ఏందిరా ఆ అదిరిపాటు - ఏందట్టా లేచావు?

సుం : మోసపోయానంటావా? దుఃఖమొచ్చి పడిందా నీకు - అంతేనా?

రా : మరేందిరా - పొద్దున్నే లేవటానికి లేదు. గొడ్లు గోలుకు పోవటానికి లేదు.

సుం : ఇది నీకు సుఖంగా లేదా? తిని తీరుబడిగా కూచోమంటే కష్టమయి పోయింది పాపం పాటుగాడికి.

రా : మరి కాదంటరా? ఏం పనీలేదు. ఊరికే కూచోమంటే నాకు ఉరి పోసుకున్నట్టుంది.

సుం : మొనగాడికి మా ఉబలాటంగా ఉంది పనిమీద. చేసింది చాలదు కాబోలు. ఎవరన్నా వింటే నవ్వుతారుగానీ ఊరుకో!

రా : ఒర్నీ బలేవోడివిరా - సుందిరిగా నవ్వనీ - నవ్వనీ నాయాళ్ళని- నాకేమన్నా భయమా?-ఊరికే గోళ్ళు గిల్లుకొంటూ కూచోలేనురా-

సుం : అయితే పోయితిరిగిరా - కొండలూ - గుట్టలూ-పొలాలూ పుట్టలూ- కాలవగట్లూ - చేలగనిమలూ - తిరిగిరా - కాళ్ళ తీట వదిలిందాకా తిరిగిరా - ఎవరొద్దన్నారు.

రా : నాకు అటువంటి ప్రదేశాల్లో తిరగటం చాలా యిష్టవేరా! పనీ పాటా లేకుండా తిరగాలంటే కష్టంరా. అలవాటుకొద్దీ వెళ్ళి తిరిగొచ్చానా - నాకేం బాగాలేదు - ఆగమ్మకాకిలా పొలోమని పోయి తిరిగి రాలేనురా. పనులంటే చెప్పు ఎంత దూరమయినా తిరిగివస్తా.

సుం : కృష్ణారామా అనుకోవలసిన వయస్సులో నీకు పనేంటి? తిరగట మేంటి? నాకు తలదిరుగుతూవుంది.

రా : నావల్లగాదు - నేనింట్లో ఊరికే కూర్చోలేను.

సుం : కానీలే నాన్నా - తండ్రిని కొడుకు ఉద్యోగం వచ్చిందగ్గ్నుంచి పువ్వుల్లోపెట్టి పూజించుకొంటున్నాడని లోకం నన్ను మెచ్చు కోవటం నీకిష్టంలేదు నాన్నా అంతేలే.

రా : అదిగాదురా సుందిరిగా అదెందుకిష్టం ఉండదురా -

సుం : మరేంది నీ వ్యవహారం. ఆ కొడుకు చూడు ఇంత ముసలివా రాచి రంపానపెట్టి చంపుతున్నాడని లోకం ఆడిపోసుకొంటుం విని సంతోషిద్దామనేకదా నువ్విట్లా అనేది?

రా : అదెట్టా కుదురుద్దిరా-నిన్నొకళ్ళొక మాటంటే ఊరుకొనేవాణ్ణంట నేను. అసలు మందెట్టాటి వొంశం? నిన్నవుడన్నా ఒక మాటంటే ముక్కలు ముక్కలుగా నరికి కాకులకూ గద్దల వేయనూ అణ్ణి-అమ్మమ్మా అట్టా మాట్టాడమాకరా, అసలే నా రేగిపోద్ది. పనిలేక ఏం చెయ్యాలో దిక్కుతోచక పిచ్చి ప నట్టుంది గాని - ఒరే సుందరిగా, నాకు దెలియక అడుగుతు కాని నువ్ చెప్పు - నువ్ పుట్టి బుద్దెరిగినాక - పొద్దు పొడి తర్వాత నేనింటో నీకనబడ్డానా?

సుం : కనబళ్ళేదు. అయితే ఏందింతకీ?

రా : పొద్దు మునక్క ముందు ఏనాడన్నా ఇంటికొచ్చేనా?

సుం : రాలేదు - అయితే-

రా : నేను తుమ్మటం, దగ్గం, చీదటం ఎప్పుడన్నా ఇన్నావా? నా కె దయినా జొరం తగిలిందా?

సుం : నిజమే అదేం లేదు.

రా : ఇప్పుడింటో ఉండాలంటే జొరమొచ్చినట్టుండడమే కాదు పిచ్చి పట్టినట్టుంది.

సుం : నీకేం తక్కువయింది? తిండా, బట్టా?

రా : పనిరా పని. పనిలేందే బతకలేనురా. పని నా ప్రాణంరా. నాకు పని కావాలిరా. పనిమీద తిరిగితే బాగుంటదిరా. నా బంగారు తండ్రి నాకేదన్నా పని చెప్పురా-

సుం : ఇంతకాలం పనిచేశావుగా చాలదూ- మనిషివి లుకచెడి పోయావు.

రా : ఛఛ - కొంతకాలం పనిచేయటం కొంతకాలం మానటమేంటిరా, పనిచేస్తే మనిషి బతికున్నట్టు గుర్తు- పని లేకపోతే చావే- శవాలు పనిచేయవు ఇంతకాలం పనిచేశాను- నిజమేరా నిజమే ఎందుకు? బతికున్నాను కాబట్టి. ఇప్పుడు పని మానేశాను అంటే ఏంటి? చచ్చినట్టు లెక్క. నన్ను నిజంగా బతికించాలని నీకుంటే నాకొక పని చెప్పు. ఈ విశ్రాంతితో చావటం నాకు చాతకాదు.

లలిత: (వచ్చింది) లేచి మొకం కడుక్కురండి. టిఫిన్ రెడీ!

సుం : మా నాన్నకో-

ల : మావయ్య చద్దన్నం పొద్దు పొడవకముందే ముగించాడు.

రా : తిండికేం కొదవలేదురా- అరగటమే కష్టంగా ఉంది. కోడలయినా కూతురులాగా చేసిపెడుతూ వుంది, కావలసినట్టు. నువ్వే నాకేం కావాలో చూడటం లేదు.

సుం : నీ కింకేం చెయ్యాలి నేను?

రా : ఏదన్నా యాపకం.

సుం : చూస్తున్నా మన్నాను కదా!

రా : అంటున్నావు కాని ఏదీ చూట్టంలేదురా నువ్వు- నా పని-

సుం : అబ్బబ్బ పనీ పని- నా తల పగిలిపోతూవుంది. నాన్న చూడు పనీ పని అని నా ప్రాణం పీక్కుతింటున్నాడు. ఎక్కడయినా ముసలాళ్ళు విశ్రాంతి-

రా : ఒరే సుందరిగా నాకు వళ్ళు మండిందంటే నేను మనిషిని కాదు- ఎవర్రా ముసిలోళ్ళు-నువ్వా, నీ పెళ్ళాం. నన్ను ముసిలోడన్నవా. నేనూరుకోను. నాకు అరవయ్యేళ్ళన్నా లేవు. మా తాత తండ్రులు నూరేళ్ళు బతికారు. శతవృద్ధులంటావే అప్పుడు ముసలితనం - ఒరేయ్ మీ తాతముత్తాతలవి కాఫీ బతుకులు కావురా - మన పొంశం ఏంటిరా ఒక్కి సన్యాసి.

ల : (ప్రవేశించి) మామయ్యాను ముసలాయన అనొద్దని మీకు ఎన్ని సార్లు చెప్పాలో నాకు తెలియటం లేదు.

రా : అలా పెట్టమ్మా గడ్డి- నేను ముసలాణ్ణంట- ముసలాణ్ణి-

సుం : లేదులే నాన్నా నువ్వు కుర్రాడివే- పడుచు కుర్రాడివే- బాగా పని పాటలు-

రా : రేయ్ అదికాదు మాట- ముసిలాణ్ణి కాదన్నాను. నీతో కుర్రాణ్ణని చెప్పానా- పనిపాటలన్నావు - అదే నా బతుకు.

ల : అదే తెలుస్తుందిలే మామయ్యా మీ అబ్బాయికి- మీకు చుట్ట తేనా? (లోపలికి వెళ్ళింది)

రా : తేసుకురామ్మా- పోరా పోయి ముఖం కడుక్కో- (లోపలికి వెళ్ళాడు)

ల : (ప్రవేశించి) ఇదిగో మామయ్యా చుట్ట——

రా : దీని దుచే రుచమ్మ - వాడికేదన్నా చెప్పి - అదేదో తొందరగా కానియమనరాదు నువ్వు—

ల : మీకిష్టమైన పనే మీకు చెప్పాలనేకదా మీ అబ్బాయి ఆలోచనా, ప్రయత్నమూ - బేంకు వాళ్ళతో కూడా మాట్లాడారు.

రా : మాతల్లే - చల్లనిమాట అట్టా చెప్పమ్మా - ఆడికంటే నువ్వే నయం. పనెట్లా ఉందో కనుక్కో-

ల : ఇవాళ కనుక్కుంటానని రాత్రేకదా చెప్పారు.

రా : నిజమేననుకో - గుర్తుందో లేదో - రాత్రిమాట నిద్దట్లో మర్చిపోతే - ఎందుకయినా మంచిది. గుర్తుచెయ్యమ్మా-

ల : అలాగే మామయ్యా

సుం : (వచ్చాడు) కబుర్లకేం కొదవలేదు - టిఫిన్ పెట్టు - రా నాన్నా టిఫిన్ కొంచెం తిందువుగాని-

రా : నాకొద్దురా- చద్దన్నం తిన్నాను - నువే దిను. పోయి పెట్టమ్మా.

(ఇద్దరూ లోపలికి వెళ్ళారు)

శంకరరావు : (ప్రవేశం) సుందరరావుగారూ! సుందరరావుగారూ!

రా : రండి. రండిబాబు - మావాడు లోపలుండాడు - మీరు?

శం : నాపేరు శంకరరావు. బేంకులో పనిచేస్తున్నాను. మీరేనా రామయ్యగారు?

రా : అవునండి.

శం : ఈ శ్రమ ఎందుకండీ మీకీ ముసలితనంలో-

ల : (ప్రవేశించి) అమ్మమ్మ అంత మాటనకండి. ఆయనకేం ముసలితన మండి. మీరు బలేవారే-వాళ్ళ వంశంలో వందేళ్ళకు ముసలితనం. ఆయన కింకా అరవై అయినా దాటలేదు.

రా : అట్టా చెప్పమ్మా-అబ్బాయిని పంపిస్తా-(లోపలికి వెళ్ళాడు)

లి : ఆయనది మంచి ఆరోగ్యమండి. ముసలివాడు అంటే పట్టరాని కోపం.

శం : నిజమే చూశానుగా మంచి ఆరోగ్యం. కాయపారు మనిషి.

సుం : (వచ్చి) నమస్కారమండి - అంతా అయింది కదా!- చాలా థాంక్సండి.

శం : ఆఁ! నమస్కారం. అయింది. దానికేముంది-

సుం : మా నాన్న సుఖపడాలని నాకెంతో ఆశ. కాని మాట వినడు. ఆయన మాట వింటేనే మంచిది. మా నాన్నను మీరు వయస్సులో చూళ్ళేదు. నాన్న శరీరం చూడటమే నాకొక వినోదం. మంచి ఆరోగ్యం. మా అమ్మ పోయింతర్వాత ఆయన తిండి పుష్టి తగ్గిపోయింది. అగులు బొగులు తిండి. అమ్మ దిగులు, అమరని తిండి. నాన్న బాగా తీసిపోయాడు.

శం : అయ్యో పాపం -

సుం : రోజంతా అడవులూ కొండలూ - మందతో బ్రతుకు - ఒక్కోరోజు అడవిలోనే నిద్ర. మనిషి బాగా కుంగాడు.

శం : మీ నాన్నను చూశానుగా - ఎండనీ వాననీ ప్రేమించిన ముఖం -

సుం : మనిషిది దబ్బపండురంగు. ఇప్పుడేంవుంది. అంతా బొగ్గు. గొర్ల మందొద్దు నీ బొందొద్దు అన్నా - విన్నాడా - వినడు. నాన్న పట్టిన కుందేలుకు కాళ్ళే లేవు - అంతే - ఇలాకాదని నాంచారయ్య దగ్గరకేపోయా - 'ఏందిరా బుడ్డోడా సంగతీ' అన్నాడు. మా 'నాన్న సంగతే' అన్నా.

శం : ఇది వినాల్సిన విషయమే - వివరంగా చెప్పండి.

సుం : మా నాన్నని నాతో తీసుకు పోతానని అన్నానో లేదో త్రొక్క తొక్కిన పాములాగా కస్సున లేచాడు. నీది బుద్ధితక్కువరా అన్నాడు. నిన్ను చదువుకోనీయటం నా కర్మరా అన్నాడు.

శం : నాకేం అంతుబట్టలేదే—

సుం : అదేందని అడిగా. ఏమన్నాడమకొంటున్నారు. చింతబరికె చేతికిచ్చి, గొర్లెంట తోలాల్సిందిరా, పలకాబలపం చేతికిచ్చి బడికి తోలాం అదే తప్పు అన్నాడు.

శం : ఆసాధ్యుడులాగున్నాడే - అంత మాటన్నాడా?

సుం : అంతేనా? - మా తాతకీ, ముత్తాతకీ, తండ్రికీ ఇచ్చిన అప్పు - అయిన వడ్డీ-మొత్తం చెప్పి-చేసిన చాకిరీకి వడ్డీతీసేస్తే అసలు అలాగ్గే ఉందని, అది కట్టు - మీ నాన్నని తీసుకుపో, అన్నాడు.

శం : ఇన్నేళ్ళు ఇందరు చేసిన చాకిరీ వడ్డీకి సరిపోయిందా?

సుం : అంతేమరి! ఆ అసలు తీర్చాలంటే నా యీ జీతంలో జీవితమంతా పోరాడినా గట్టున పళ్ళేనని తెలిసిపోయింది. మా నాన్నని ఈ వెట్టి నుంచి తప్పించలేనని తెలిసిపోయింది. కళ్ళ నీళ్ళు కళ్ళలో కుక్కుకొని వచ్చేశాను.

ల : (లోపల్నుంచి) మీ నాన్న చూడండి. పనిపిల్లవాళ్ళా ఎలా ఏడుస్తున్నాడో—

రా : ఎవరన్నారు? (వస్తూ) నేనేం ఏడవటం లేదు.

సుం : నువ్వెందుకు నాన్నా ఏడవటం? నిన్ను విడిపించుకోలేకపోయిన దురదృష్టవంతుణ్ణి నే నేడవాలి!

రా : నాకోసం నువ్వు అక్కడా ఇక్కడా తిరగటం చూశాను గదరా నేను. అది తలచుకొంటే - కళ్ళు తడి అంతే!

సుం : కానీ సంవత్సరాల తరబడి కొండల్లో కోనల్లో తిరిగిన నిన్ను చూచి కళ్ళు కాలవలయి, తడి ఎండి, ఆరి, ఇప్పుడు మా కళ్ళు ఇసుక ఎడారులు.

రా : గొర్లమందతో పోవటం కష్టంగా కాదు, సంతోషంగా ఉండేది. మంద మరో ఏటికి మరో మంద అవుతుంటే ఎంత ఆనందంగా ఉండేదని,

శం : ఆ ఆనందమే ఎంత పనయినా చేయిస్తుంది.

రా : గొర్లు నీళ్ళు తాగుతుంటే ఏరు పాలిచ్చే తల్లిలా తన్మయం చెందటం ఎంత బాగుండేదంటా! గడ్డి పరకలు గొ[్రె] పిల్లలు సుతారంగా కొరికి తింటుంటే ఎంత ముద్దుగానో ఉండేది. గొర్లు భయం పుట్టినప్పుడు మనిషిని చుట్టుకోవటం చూడాలిరా, తల్లి దండ్రుల చేతుల కింద చేరే పసిబిడ్డలురా అవి.

సుం : వాటినన్నింటినీ నాంచారయ్య ఏంచేసేవాడో నీకు తెలుసా?

రా : తెలియకేం? వాటిని కటికోళ్ళకు తోలేవాడు.

సుం : నీకు బాధ కలిగేది కాదూ?

రా : ఎందుకూ బాధ- అందరమూ ఒక రోజుకు అయిపోవలసిందేగా-. గొర్లు ఒకరోజు ముందు-అంతే-ముందూ వెనకా-అంతే తేడా.

ల : ఆయనకెంత వేదాంతమో చూడండి!

శం : అదేం వైరాగ్యమండి మీది - మరీ విడ్డూరం!

సుం : అది సర్దుబాటుతనం. ఏమీ చేయలేక ఏదో చెప్పుకొని సముదాయించుకోవటం——

రా : ఏదోలేరా - అయిపోయిందిగా.

సుం : ఆ గొర్లు అమ్మితే సంవత్సరానికి ఎంత వచ్చేదో తెలుసా ?

రా : నాకెట్టా తెలుసుద్ది ?

సుం : ఆ మేడలు, ఆ సుఖాలు, ఆ సంతోషాలు, ఆ పెళ్ళిళ్ళు, ఆ వినోదాలు నీ డబ్బుతో వచ్చాయి.

రా : ఆ డబ్బు నాదెట్టా అవుద్దిరా-నీది మరి ఇపరీతం-

సుం : మరెవరిది ?

రా : ఎవురిదేంది? నాంచారయ్యది.

సుం : కష్టపడ్డాడా - గొర్లు మేపాడా - ఎట్టా అవుతందది నాంచారయ్య డబ్బు?

ల : అది గొర్ల డబ్బు.

శం : గొర్లు మేపినోడికే చెందుతుంది.

రా : గొర్లు నాయి కావే !

శం : వాటి పిల్లలు నీవే !

రా : ఏందోరా బాబు - నాకేందీ దెలియదు.

సుం : ఇట్లా నిన్ను దోచుకొని - నీ సొమ్మంతా తిని - నువ్వింకా బాకీ అంటాడు నాంచారయ్య.

రా : అవును అట్టాగే అంటాడు.

సుం : నిజానికి నాంచారయ్యే నీకు బాకీ !

రా : బాగుందిరా నీ వరస !

శం : నిజమంతేనండి !

ల : దోచుకోవటమంటే ఇదే- అదృష్టం బాగుండి సరిపోయింది కాని-

సుం : లేకపోతే ఈ వెట్టి చాకిరీ తప్పేదా అంటావు- ప్రభుత్వం వెట్టి చాకిరీ రద్దు చేసింది కాని - చేసిన పని వడ్డీతో సహా నష్టపరిహారం ఇస్తూ రద్దు చేయవలసింది.

ల : ఇదయినా మేలే కదండీ-

సుం : మేలే - కాని.

రా : నాకీ చాకిరీ లేకపోతే పీకులాటగా వుందిరా!

సుం : అయితే పోయి నాంచారయ్య గొర్లు మేపు - పీకులాట తప్పుతుంది.

రా : ఇక ఆళ్ళ గొర్లు మేపనురా - నాకు గొర్ల గొర్లమంద కావాలి. అవి నాదే కావాలి. ఏందో ఏర్పాటు చేస్తానంటుంటిరే!

శం : అదేమో నిజమే!

ల : చెప్పండి. మామయ్య ఆశచూచి చెప్పండి.

సుం : నాంచారయ్య దగ్గర నువ్వు వెట్టి మానిం తర్వాత - అమ్మినన్ని గొర్రెల్ని అమ్మేశాడు. అమ్మకుండా ఇంకా పెద్దమందే ఉంది. వాటిని కటికోళ్ళకి అలువులు సులువులుగా బేరం పెట్టాడు. ఆ మంద - ఆ మంద - మేం కొన్నాం. రేపే నువ్ పోయి ఆ మంద తోలుకొని రావచ్చు.

రా : నిజంగానా తండ్రీ- నిజమేనా ఇది-అదేనా నా మంద!

ల : చూడండి, ఆయన ముఖం ఎట్లా వెలిగిపోతూవుందో!

సుం : మా నాన్న ముఖం చూడండి - ఎట్లా పసివాడి ముఖం అయిందో-

రా : ఆరేయ్! నేనేం పసివాణ్ణికాను. ముసలాణ్ణికాను. జీతగాణ్ణికాను- యజమానిని - గొర్లమంద యజమానిని - తెలుసా!

(అందరూ నవ్వుతూ ఉండగా తెర.)

# దర్శనం

పాత్రలు

1. రాజన్న.
2. పూజారి.
3. ప్రసిడెంటు
4. శేషమ్మ.
5. గిరి.

రంగస్థలం :

శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ ప్రాంగణం

(తెర లేచేసరికి రంగస్థలంమీద రాజన్న, పూజారి ఉన్నారు.)

రాజన్న : పూజారిగారూ ! నేను వేణుగోపాల స్వామి దర్శనం చేసుకోవాలి టెంకాయ కొట్టాలి. పరీక్షపాసయితే నీ దర్శనం చేసుకొంటానని మొక్కుకొన్నా-

పూజారి : దర్శనం చేసుకొంటావా? టెంకాయ కొట్టాలా?- బలేవాడివేరా రాజన్నా-చాలుచాలుగాని పోయి మరిడమ్మకో మారెమ్మకో కొట్టుకో. గుళ్ళో టెంకాయ కొడదామని ఎలా మొక్కుకున్నావురా- నువ్వు అంటరానివాడివని మర్చిపోయావా-నీ దుంపతెగ-నువ్వు మొక్కుకొంటే సరిపోద్దా-

రా : మీరొప్పుకొంటే సరిపోదా?- పదోతరగతి ఫస్టుక్లాసులో పాసయ్యానండీ!

పూ : అయితే అయ్యాపులే-పోపో-నువ్‌గుళ్ళోకొస్తే ఇంకేమయినాఉందా?

రా : ఎట్లా అయినా నా మొక్కు తీర్చాలి మీరు.

పూ : వీల్లేదుపో-

రా : అల్లాఅంటే ఎల్లాగండి!

పూ : ఎన్నిసార్లు చెప్పాలిరా నీకు-వీల్లేదుపో.

రా : వీల్లేదంటే వీల్లేదండి. నేను టెంకాయ కొట్టితీరాలి.

పూ : ఏరా దౌర్జన్యమా?

రా : కాదండి భక్తి!

పూ : నీ మొకం భక్తి. పోరా పో!

రా : మీరడ్డుపడ్డా నేనాగను పూజారిగారూ, అడ్డం లెండి.

గిరి : (వచ్చాడు) అన్నా! ఏందన్నా గొడవ. ఏమయింది పూజారిగారు!

పూ : నేను పోనివ్వనురా నిన్ను!

రా : లెండి!

పూ : ఆగు.

రా : నన్నాపొద్దు! నన్ను నెట్టొద్దు. చూడండి పూజారిగారూ, మెడ మీద చేయి తీయండి. నేను చెయిచేసుకొంటే బాగుండదు.

గిరి : అన్నను నెట్టొద్దు, పూజారిగారూ!

పూ : గుళ్ళోకి వస్తావా-పోరా చండాలుడా!

గిరి : అన్నా, ఎంత పాటు పడ్డావురా! ఎందుకండీ అలా తోశారు. అయ్యో టెంకాయ పగిలిపోయింది.

రా : అమ్మా!

గి : అమ్మ ఇక్కడ్లేదన్నా-అయ్యో తలపగిలింది. పూజారిగారూ బాగా చూడండి అన్న తల పగిలింది.

పూ : ఇంతకీ పగిలింది టెంకాయా? తలకాయా?

గి : ఉండన్నా తుడవకు. చూడండి ఎలా కారిపోతూవుందో?

పూ : నీళ్ళా? నెత్తురా?

రా : పూజారిగారూ! ఇది తీర్థం. పుణ్యతీర్థం. సేవించండి. అభిషేకించండి. తలకాయ పగిలినా, టెంకాయ పగిలినా మీకేం చీకూ లేదు-చింతా లేదు. నీళ్ళుగారినా, నెత్తురుకారినా మీకేం పట్టదు. మీకు, మా నెత్తురు నెత్తురే అనిపించదు. పైగా నీళ్ళులా కనిపిస్తుంది. చేయించండి పూజ, అభిషేకం.

పూ : ఏమిట్రా ఊరికే కూస్తున్నావు - పో అవతలికి.

గి : కదలొద్దన్నా - కట్టుకట్టనీ - నుదుటికి మంచి దెబ్బే తగిలింది. నెత్తురు బాగా పోయింది. గాయం పెద్దదే - కట్టుకట్టినా నెత్తురు ఆగటం లేదు.

రా : అదే పోతుంది లేరా!

పూ : ఒరే గిరీ! వాణ్ణి ఇంటికి తీసుకుపో!

గి : అన్నా అమ్మను పిలుచుకొస్తానుండు! (వెళ్ళాడు)

పూ : ఒరేయ్-అడ్డగాడిద - నువ్ లేచి వెళతావా లేదా!

రా : నేను పోను. దేవుడి దర్శనం చేసుకోందే ఇక్కణ్ణుంచి కదల్ను.

ప్రసిడెంటు : (వచ్చాడు) ఏంది పూజారీ! ఎప్పుడూ ఏదో తెచ్చిపెడుతూనే వుంటావు.

పూ : వీడూ—

ప్ర : విన్నానులేవయ్యా-నాకు తెలియక అడుగుతా దేవుడు నీ సొత్తా- నీయబ్బసొత్తా.

పూ : అయ్యో తమరే—

ప్ర : అవును ధర్మకర్తనే-దేవుడి ఆస్తులు నేను తప్ప ఎవరు కాపాడ తారు? - నేనే! - ఒప్పుకొన్నాం.

పూ : ఈ రాజిగాడు మళ్ళీ గుళ్ళోకి వస్తానంటే—

ప్ర : నిజమే-నువ్వు రానివ్వవు-సరే-దేవుడి పరిశుభ్రతను నిలిపేదెవరు?- నువ్వే - అంగీకరించాం.

పూ : అయ్యో తమరేదో—

ప్ర : ఓట్లకోసం మాట్లాడే తీరా యిది - కాదే - నాకు తెలియక అడుగు తున్నాను, ఓట్లకోసం మాట్లాడినట్లు - ఏదో సామెత చెప్పినట్లు- మాట్లాడేనే అనుకో తప్పేంటి?

పూ : తప్పంటే తప్పేంలేదు గానీ ప్రసిడెంటుగారూ—

ప్ర : అది సరేలేద్దురూ! ఓట్లు ఎప్పుడు వేస్తారు?

పూ : మంచిగా మాట్లాడితే—

ప్ర : బాలా బాగా చెప్పావు పూజారీ! మరి మంచిగా మాట్లాడటమంటే ఏంటి?

పూ : వాళ్ళ కిష్టమయిందే మంచిగా చెప్పటం—

ప్ర : అదే చాలదు. మంచి చేయాలి. అంటే అవతల వాళ్ళ మేలు కోర టమేకదా! మేలే అయినప్పుడు ఓట్లకోసం మాట్లాడినట్లు మాట్లాడితే తప్పులేదయ్యో పూజారీ!

పూ : మాటలయితే పరవాలేదండి.

ప్ర : చేతలయితేనే అంటావు కష్టం?

పూ : అవునండి.

ప్ర : ఒరే రాజన్నా—

రా : పిలిచారా ప్రసిడెంటుగారూ?

ప్ర : నిన్నుగాదు నువ్వుండరా! ఒరే రాజన్నా నువ్వు గుళ్ళోకి పోరా అంటే మంచి మాటే కదా!

పూ : కాదండి.

రా : అవునండి.

ప్ర : మరి - రాజన్నా రారా నాతో గుళ్ళోకి అని తీసుకుపోతే?

పూ : మంచి చేష్ట అంటారు మీరు. అంతేనా?

ప్ర : సరిగ్గా అంతే! మేమిద్దరం లోనికిపోతే నువ్వేం చేస్తావు? ఏమీ చేయలేవు.

పూ : తమరలా చేయకూడదండి.

ప్ర : నేనిడే వుండి ఎవరొస్తారో చూస్తాను నువ్వు గుళ్ళోకి పోయి రారా రాజన్నా అంటాననుకో.

రా : అనండి! పోయొస్తాను.

పూ : అనకూడదండి. పోనీయను.

ప్ర : బలేవాడివే పూజారి! దేశం మారిపోయింది. నా మాట విను.

పూ : పిదప కాలం. పిదప బుద్ధులు.

ప్ర : ఎవర్ని నువ్ తిట్టేది ?

పూ : దేశాన్ని - నా కర్మని!

ప్ర : బాగుందికానీ - కాలంతో పాటు మనమూ మారాలి పూజారీ!

పూ : ధర్మకర్తగారేం సెలవిస్తున్నారో నాకేమీ అర్థం కావటంలేదు-

ప్ర : ఏమీలేదు - రాజన్నని నువ్వు గుళ్ళోకి పోనివ్వాలి.

పూ : నావల్లగాదు.

ప్ర : వాడివల్ల అవుతుంది, నువ్వాపలేవు. ఇది ప్రవాహం. ఆనకట్టల్లేవు. ఉన్నా కూలతాయి. నా మాట విను.

పూ : ధర్మకర్తగారూ! నేను వినలేను.

ప్ర : పూజారీ! వినకపోతే ప్రవాహంలో కొట్టుకుపోతావు. నామరూపాలుండవు.

రా : ప్రసిడెంటుగారూ, మీరింత ఉన్నతులని, విశాల హృదయులని, సంస్కారులని ప్రేమ స్వరూపులని నాకు తెలియదండి.

ప్ర : నీకిప్పుడేం తెలుస్తుంది రాజన్నా! నువ్వు పూజారి అనుమతి పొందు. దైవదర్శనం చేసుకో - పూజారీ రాజన్నను పూజ చేసుకోనీయి.

పూ : వీలుకాదండి.

ప్ర : (నెమ్మదిగా) ఇలా రావయ్య. జాగ్రత్తగా విను మంచిమాటలు. ఎన్నైనా చెప్పు. తప్పేంఉంది. చేష్టలున్నాయే. అవి వద్దు-

పూ : (పెద్దగా) ఎలా కుదురుతుందండి ?

ప్ర : (నెమ్మదిగా) కుదరకేం ఉంది ? పో పూజచేసుకో అను. సంతోషిస్తాడు. ఏ విధంగానూ లోనికి పోనివ్వవద్దు

పూ : పోతానంటే.

ప్ర : మంచి మాటలతోనే ఆపాలి.

పూ : నా చేతకాదండి. మంచిమాట మంచిచేతకు దోవ తీస్తుంది. మంచి మాటలతో చేతలు లేకుండా చేయటం నా వల్లకాదు.

ప్ర : కానిదేముంది. కొంకాయ తెచ్చుకో - దర్శనం చేసుకో అను. అంతే! - ఒరే రాజన్నా దేవుడి దర్శనం చేసుకో!

రా : మీరెంత మంచి వాళ్ళండి! మీ మనసెంత గొప్పది!

పూ : దూకొద్దురా రాజన్నా! నువ్వూ ప్రసిడెంటుగారూ ఇద్దరూ కలిసి వెళ్ళి దర్శనం చేసుకురండి.

ప్ర : (నెమ్మదిగా) ఇరికించావు కదా పూజారీ!

రా : ప్రసిడెంటుగారూ! రండి మీతో నేనూ వస్తాను.

ప్ర : నాకిప్పుడు వీల్లేదు కదరా- స్నానం కాలేదు - ఏదో సీతో గొడవ అని విని ఇలా వచ్చాను గానీ -

రా : నాకోసం దయచేసి గుళ్ళోకి రండి.

పూ : అపద్ధర్మంగా స్నానం చేయక పోయినా పర్వాలేదు. అంటరాని వాడయినా పర్వాలేదు, గుళ్ళోకి పొండి.

ప్ర : అమ్మ పూజారీ! ఎంత చేస్తున్నావురా! (నెమ్మదిగా)

రా : నాకోసం దయచేసి గుళ్ళోకి రండి.

పూ : తీసుకెళ్ళండి.

ప్ర : ఎంత పితలాటకం పెట్టావయ్యా. ఇప్పుడు కాదు రాజన్నా-ముందికి వళ్ళు - వద్దు. (వెళుతున్నాడు)

పూ : ఏమండీ ప్రసిడెంటుగారూ! రాజన్నకు దైవదర్శనం చేయించ కుండానే వెళ్ళిపోతున్నారే! - (నెమ్మదిగా) అయ్యా ప్రసిడెంటు గారూ - తెలివితేటలు మీ ఒక్కడి సొత్తే కాదండి. మంచిగా మాట్లాడినట్లే మాట్లాడాలి. మంచేమీ చేయరాదు. అమ్మ మీ రాజకీయం తగలబడిపోను!

రా : ఏంటి పూజారిగారూ! మీలో మీరే మాట్లాడుకొంటున్నారు?

పూ : ఏంలేదురా! ప్రసిడెంటుగారు నిన్ను గుళ్ళోకి తీసుకెళతానని అలా వెళ్ళిపోయారేమా అని అనుకొంటున్నా - ఒరే! నువ్వు గుళ్ళోకి వస్తే నాకేం నష్టంలేదు - దేవుడికి ఏం కష్టంలేదు. జనం సహించరు. నన్ను పూజారిగా ఉంచరు. పోరా నువ్విక్కణ్ణుంచి.

రా : నాకు తెలుసండి మీ మాటల్లో అమృతం, చేతల్లో విషం. మీరా నన్ను చూస్తూ చూస్తూ గుళ్ళోకి పోనిచ్చేది? మీరేం చేయాలో మీకు తెలుసు - నేనేం చేయాలో నాకు తెలుసు!

గిరి : (వచ్చాడు) అమ్మా అడుగో అన్న - ఆ కట్టు చూడు నుదురంతా పగిలిపోయింది.

రా : ఈ దెబ్బతో దేవుడి నుదుటిరాత మారిపోతుందిరా! మంచిరాత నెత్తుట్లోంచి మొలుస్తుందిరా.

శేషమ్మ : (వచ్చింది) ఏరా తండ్రీ - ఏమిట్రా ఈ దెబ్బ - మనకెందు కొచ్చిందిరా - పోదాంరా!

రా : నేను రానమ్మా!

పూ : శేషమ్మా - వాణ్ణి తీసుకుపో - చూస్తావేరా గిరీ వాణ్ణి లాక్కుపో-

రా : నేను పోను - నన్నెవళ్ళూ తీసుకుపోలేరు, పంపించలేరు.

శే : ఎంత దెబ్బ తగిలిందిరా!

గి : నుదురంతా పచ్చడి పచ్చడి అయిపోయిందమ్మా!

పూ : అంతేరా! చేయరానిపని చేయబోతే దేవుడూరుకొంటాడా? సరి పోయింది - ఇకపొండి.

శే : ఎండపొద్దు - తిండి తిందువు రా!

రా : నేను రానమ్మా!

శే : రాక ఏం చేస్తావురా?

రా : అమ్మా! చిన్నప్పుడు అరిసెలు వండి రెండంటే రెండే ఇచ్చి అన్నీ అటకమీద దాచిపెట్టావు గుర్తుందా?

శే : లేకేంతండ్రి! అదెలా మర్చిపోతానురా!

రా : తెల్లారేసరికి అన్నీ అయిపోయాయికదా!

శే : అవున్రా అన్నీ తినేశావు.

రా : ఎందుకు తిన్నానమ్మా! ఆకలయికాదు - నాకిష్టమయింవాన్ని - నాకు దూరంగా ఉంచలేవని నీకు తెలిసిపోయింది. కానీ-

గి : కానీ - ఏమయింది?

పూ : వాడేం చెబుతాడురా! నేను చెబుతాను విను. వాడికిప్పుడు దేవుడిష్టం కదా! దేవుణ్ణి వాడికి దూరంగా నేనుంచలేను అంటున్నాడురా!

శే : అంతమాట వొద్దు పూజారిగారూ! నా తండ్రి అట్టాట్టి మాటలనడు.

పూ : పిచ్చిదానా! ఆ రోజు నువ్వొచ్చి నాకొడుకు అరిసెలన్నీ తిన్నాడు- కడుపుబ్బింది మందియ్యండి అని అడిగావు గుర్తుందా?

శే : మీరిచ్చిన మందుతోనేకదా బిడ్డ కడుపుబ్బరం తగ్గి బాగుపడ్డాడు-

పూ : నీకు గుర్తుందిసరే! రాజిగాడికి గుర్తుందటనా?

శే : గుర్తులేకేం - ఇంతకీ మీరనేది-

రా : ఏమీలేదమ్మా నీకిష్టమయింది నువ్దిండే మేం వేయాల్సిన మందు మేం వేస్తామంటున్నాడమ్మా!

గి : తిండీ మందులూ ఏమిటి?

రా : అంతమాత్రం తెలియలేదా! నేను లేనప్పుడు 'గుడి తలుపులు తీసుకొని నువ్వుపోయి దేవుడి దర్శనం చేసుకొంటే, నేనొచ్చి మళ్ళీ చెయ్యి చేసుకోవలసి వస్తుందని నాకు హెచ్చరిక చేస్తున్నాడురా!

శే : ఏమీకాదు. పూజారిగారు చాలా మంచాయన. అట్లా ఎన్నటికీ అనడు.

రా : అనడనడు. మాటయితే అనడు, పనయితే చేస్తాడు. ప్రసిడెంటో- పనయితే చేయడు. మాటయితే - ఎన్నయినా అంటాడు.

శే : రా నాయనా! రాత్రికూడా సరిగ్గా తినలేదు.

రా : ఇప్పుడు కడుపు నిండిపోయిందమ్మా - ఒరే తమ్ముడూ మీరు పొండిరా!

గి : నిన్ను తీసుకుపోకుండా మేం పోం!

పూ : ఏరా కాపలా కుక్కల్లా ఇక్కడే ఉంటారా?

శే : ఏదోలే పూజారిగారు కుక్కలమో - మనుషులమో ఆ దేవుడికే తెలియాలి.

పూ : చూడండి, నేను లేకుండా చూచి లోపలికిదూరారో నాకసలే తిక్క- ఊరుకుండేవాణ్ణికాను.

రా : ఇంకా ఏం చేస్తారు?

పూ : తోలొలుస్తాను.

రా : అంతేకదా!

గి : మాకెందుకండీ మీ గుడి. పొండి పొండి. మేమూ వెళతాం.

రా : మనం గుళ్ళోకి పోదాం రండి.

శే : వద్దురా బాబు!

గి : వద్దన్నా! వాళ్ళేమన్నా చేస్తారు!

రా : ఏం చేస్తార్రా?

శే : మనం మనింట్లోనే దేవుణ్ణి పూజించుకొందాం!

రా : నాకీ దేవుడి పూజే వద్దమ్మా!

గి : ఎందుకన్నా నుదుటికట్టు విప్పేది-వద్దు విప్పొద్దు.

రా : గాయం చూపి ఎందుకు తగిలిందో చెప్పమని దేవుణ్ణి అడుగుతా. మొక్కు తీర్చుకొందామని దేవుడి దర్శనం చేసుకొందామని వస్తా. నాకీ దెబ్బ ఎందుకు తగలాలి?

గి : పూజారి చేసిందానికి దేవుడేం చెబుతాడు?

రా : వీడా దేవుడి పూజారే కదా!

శే : ఎక్కడికిరా!

రా : నాతో రండి మీరు!

గి : తలుపులు తీయొద్దన్నా-లోనికి పోవద్దురా!

రా : మీ యిష్టం-నేను పోతున్నా- (నడిచాడు)

శే : రారా రాజన్నా-

గి : పోవద్దన్నా - అమ్మా అన్న గర్భగుడిలోకి పోతున్నాడు.

శే : వచ్చేసెయ్ - వీళ్ళు వస్తారో ఏమో - మళ్ళ [illegible] వెధవ పరీక్ష - వీడు పాసు కాకపోయినా [illegible].

గి : ఏమవుతుందో ఏమో-

రా : వేణుగోపాలస్వామి నువ్వెంత అందంగా ఉన్నావయ్యా - [illegible]దుకీ జనం నీ దగ్గరకు రానీరు-చెప్పు-ఎందుకు? [illegible]? నువ్ రాయివైపోయి బ్రతికిపోయావ్.

గి : అమ్మా పూజారి పరుగెత్తుకొస్తున్నాడు.

శే : అయ్యో అయ్యో రాజన్నా రారా - వా[illegible].

రా : నా నుదురు ఎందుకు పగిలింది చెప్పు. [illegible]? మొక్కు తీర్చాలనుకోవటం తప్పా. ఎందుకీ [illegible]? నా నుదుటే ఈ నిప్పుల మంటేమిటి?

గి : అమ్మా అన్న నుదురు బాదుకొంటున్నాడే!

శే : అయ్యో! అసలే పగిలిన నుదురు. నెత్తురు మళ్ళీ కారుతుందో ఏమో! వాడొచ్చేస్తే బాగుణ్ణు.

గి : అమ్మా ప్రసిడెంటుగారు చూడు ఎంత దూకుడుగా వస్తున్నాడో. ఏమంటాడో ఏమో!

శే : ఏమి జనంరా బాబు! ఇంతమంది వస్తున్నారేమిటిరా!

గి : అటు జనం-ఇటు అన్న-మనం ఈడ. అమ్మా ఏమవుతుందో?

రా : వేణుగోపాలస్వామి నీ నుదురెంత అందం! ఏమిటా కుంకుమ? అలా రాలిపోవచ్చా. ఉండు కుంకుమబొట్టు పెడతా. ఏ కుంకుమ ఎల్లకాలం ఉంటుంది? ఉండదుండదు! ఎప్పుడూ ఉండే కుంకుమ బొట్టు ఇదిగో.

శే : రాజన్న వేణుగోపాలస్వామిని వాటేసుకొంటున్నాడా ఏంటి?

గి : కాదమ్మా అన్న తన నుదుటిని దేవుడి నుదుటిమీద రుద్దుతున్నాడు. దేవుడి నుదుట అన్న నుదుటి రక్తం - పెద్ద బొట్టు చాలా బాగుందమ్మా.

శే : ఏం బాగురా తండ్రి. కనపడి చావటంలేదు. వీళ్ళంతా వచ్చేశారు కదరా!

ప్ర : ఏయ్ ఎవర్రా అది!

పూ : తన్నండిరా వాణ్ణి.

ప్ర : ఉండండిరా!

రా : ఏం స్వామి నవ్వుతున్నావు? నా రక్తం నీకు బొట్టా? ఎంత బాగున్నావు? నీ నుదురు నా నుదురయిందా, నా నుదురు నీ నుదురయిందా? నీ తలరాత మారిందా? నా తలరాత మారిందా?- మనిషి శరీరం రాతికి తగిలి రాయి శరీర మయిందా, రాయి మనిషికి తగిలి మనిషి రాయి అయ్యాడా? స్వామీ - ఏమయింది?

(తెర)

# కూలీ

పాత్రలు

1. రంగడు
2. అంతరాత్మ
3. దొర
4. ఖాసిమ్మ
5. బసవయ్య

రంగస్థలం :
పశువుల కొట్టం

అంతరాత్మ : రంగా! ఓ రంగా! నీకు వినపళ్ళేదా? నువ్వు మాట్లాడ దలచుకోలేదా? నిన్నేరా!

రంగడు : (మెల్లగా) ఎవర్నువ్వు?

అంతరాత్మ : నేనేరా - నన్నే గుర్తు పట్టలేదా?

రంగడు : పెద్దగా అరవకు, దొర నిద్ర చెడుద్ది - నేనే నంటా వెవర్నువ్వు?

అం : ఇంకా తెలియ లేదా? నీ అంతరాత్మని.

రం : నువ్వా? నీకిక్కడేం పని? ఏం నన్నీమధ్య వదలకుండా సతా యిస్తున్నావే - ఏంగావాలి నీకు?

అం : నాకేం వద్దుగానీ - నువ్వు ఊపిరి పీలుస్తున్నావా?

రం : ఓం !

అం : ఏదీ ముక్కు కదలటంలేదు. గుండె గూడా ఆడటంలేదు.

రం : ఇంకా నయం. నేను బతికే లేననుకోలేదు. ఎందుకొచ్చింది నీకీ అనుమానం?

అం : ఏం లేదు - నువ్వు ఊపిరి పీలిస్తే ఆ శబ్దానికి నీ దొర నిద్ర చెడిపోతుందని భయంతోగాని గాలి పీల్చటం మానేశావేమోనని సందేహం.

రం : నీకు సరయిన దేహం లేదుగాని సందేహాలకేం కొదవలేదు.

అం : నీకు దేహం ఉందిగాని సందేహాలకే కొదవ.

రం : నాకెందుకు సందేహాలు—

అం : దొర కూలీ ఇవ్వకపోతే-

రం : ఇస్తాడు.

అం : మధ్యాహ్నం దాకా నిన్నిక్కడే కూర్చోబెడితే-

రం : ఇప్పుడే ఇస్తాడు.

అం : నిన్నీరోజు కూలికెవరూ పిలవకపోతే-

రం : పిలుస్తారు.

అం : ఈ పూటకి కూటికి లేకపోతే-

రం : (విసుగ్గా) చస్తాను.

అం : ఇంటిల్లిపాదీ-

రం : (కోపంగా) చస్తాం.

అం : ఆ చచ్చే చావేదో పిలిచ్చావు- దొరా కూలిడబ్బు లివ్వండి ఇంట్లో గంజి కాసుకోవాలి. ఇవాళ్టి కూలికి పోవాలి- అని పిలిచ్చావు. ఊరికే బెల్లం కొట్టిన రాయిలా ఆ గోడకట్టా నడుం మోటిచ్చి కూచుంటే సరిపోద్దా- దొరా అని పిలువు!

రం : దొరకు నిద్ర చెడదూ!

అం : నీకు కూలి చెడదూ!

రం : ఏందీ చెడదులే! పో అవతలికి!

అం : నీ కర్మ- నీకంటే ఆ గుళ్ళోని రాయి నయం.

రం : ఏం ఎందుకని?

అం : ఎండమండితే రాయి కాలుతుంది.

రం : అయితే——

అం : నీకు అకలి మండినా కోపం తగలబడి చావదే-

రం : నాకు కోపమొస్తే ఊరుకోను.

అం : ఊరుకోవద్దు. ఏదీ అరువు- నీ దొర నిద్రలేచేటట్లు అరువు.

రం : అరిచే కుక్కలు కరవ్వు.

అం : నిజమే! అది కుక్కల సంగతి. మనుషుల వ్యవహారం కాదు. కరిచే మనుషులే అరవాలి. మళ్ళీ కరుద్దువుగానిలే- ఇప్పటికి అరువు. ఏదీ ఒక్క కేక- ఏదీ- కొంచెం కోపం- కోపమే రాలేదా?

రం : ఏయ్ నీగ్గాదు చెప్పేది- పో అవతలికి- ఏం వళ్ళు ఎలా వుంది? తీపరంగా ఉందా? పో అవతలికి - నీకాˍదూ చెప్పేది? నేనసలే తిక్కమనిషిని, నాకు రేగిందంటే నీకు మంచిదికాదు. పో - పోతావా లేదా?

అం : పరవాలేదే-నీకుకోపం వచ్చింది. పైగా గొంతెత్తి అరిచావు.

బసవయ్య : (వచ్చాడు) ఎవడ్రా అది- ఏమిట్రా గోల-నాన్నగారు నిద్ర పోతున్నారని తెలియదా? ఏందిరా పొద్దున్నే నీ ముఖం చూశాను. ఏం తెల్లారక ముందే తగలబడ్డావు ఏం - ముంచుకొచ్చింది ?

రం : (మెల్లగా) ఏందీలేదు.

బ : ఏందిరా నసుగుడు! చల్లకొచ్చి ముంత దాస్తా వెందుకు చెప్పు! ఎందుకొచ్చావు?

రం : నిన్నటి కూలీ-ఇంట్లో ఏందీ లేదు-గంజికాసుకొందామని -

బ : సరీగ్గా చెప్పేడువ్ - ఏంకావాలి?

రం : మీ యిష్టం.

బ : సర్లే. దొడ్లోకిపోయి రెండు పనలు ఎండు గడ్డి తీసుకురా! మన వామి తెలుసుగా-చొప్పదంటు తెచ్చేవ్-వద్దు-జనప కట్టావద్దు వట్టి గడ్డి చాలు. పోయిరా పొద్దెక్కిపోద్ది. పలుపుతాడు పంచలో ఉంది. చూడు పెద్దమోపు కట్టుకొనేవు-సడుగలు జారేను. అసలెత్తుకోలేక సత్తావ్-చిన్నమోపు తీసుకురా!

రం : సరేలెండి!

బ : ఇంకా ఇక్కడే ఉన్నావా?

అం : కూలి డబ్బులు అడిగి తీసుకొన్నట్లున్నావే!

రం : మళ్ళీ నువ్వా? - ఛీ నోర్ముయ్.

అం : పొయ్‌లో పిల్లి లేచినట్లేనా?

రం : నన్ను సతాయించొద్దన్నానా లేదా?

అం : ఇవాళ కూలి చెప్తట్టేగా-

రం : చూద్దాం చూద్దాం. తొందరగా ఒక మోపు అవజపేస్తే సరిపోయె. కూలి డబ్బులు చేతబట్టుకొంటే పనికి పోవటం ఎంతసేపు?

అం : సరేపద - ఏందంత ఒడుపుగా లాగుతున్నావ్ గడ్డి?

రం : ఇంతకంటె బాగా గడ్డి గుంజేవాడెవడీ చుట్టు పక్కల పదిపరగ జాల్లో లేడు.

అం : నీతో సమానంగా మరొకళ్ళుండటమా? అప్పే - అదేంమాట - ఈ మొయిన అయితే ఈ పూటకి పనికి నాగా పెట్టినట్టేనా?

రం : అట్టైట్టా - కొంచెం మోపెత్తు.

అం : బసవయ్య చెప్పలా పెద్ద మోపొద్దని - నువ్వింటావా?

రం : మోపెత్తుతావా లేదా?

అం : పట్టుపట్టు - మహాచులాగ్గా ఎత్తేసుకొన్నావ్ - ఏందా దూకుడు - కాస్త నిదానంగా నడుపు. ఎద్దుమీద పడేవ్. అటువదేమ్ - ఇవ్వా దయినా కూలీ అడుగుతావా?

రం : ఎందుకూ? బసవయ్య చూశాడుగా - వాళ్ళనాయనతో చెబుతాడులే! కూలీ ఇచ్చేస్తారు.

బూసిమ్మ : (వచ్చింది) ఎవర్రా అది. రంగడా? ఒరేరంగడా! ఆ దూడ బోయింది చూడరా! పట్టుకొట్టేయరా! ఏం దెంగనాబురా బాబు! హో హో -

రం : దాన్నెందు కొదిలావంటి!

బూ : పాలు దాగటానికి వదిలానురా. అవట్టా వళ్ళాపై గానకుండా దూకుతుంటే ఏంచేసిచావను.

రం : మీరుండండి నేబట్టుకొట్టేస్తాగా - మీరు లెండి. ఏడకట్టేయ మంటారు?

బూ : అదుగో ఆ గుంజగ్గట్టేయరా - అట్లాగే ఒరే రంగడు! ఆ ఎద్దకి కొంచెం కుడితిపెట్టరా - అదేంరా - ఆ గోనెబస్తాలో చిట్టూతవుడూ కలిపి కుడితి పెట్టరోయ్. తొట్టిలో కింద చద్దిబువ్వుంది. చెయి పెట్టి తిప్పరా!

బ ఒరే ఒరే! నీకేం పోయేకాలంరా! ఏందిరా అంత తవుడు - ఆర బస్తా కుమ్మరించా తొట్టిలో.

బూ : నేనే వేయమన్నా లేరా!

బ : అదిసరే! ఇదేం అన్యాయంరా అంత తవుడు ఒక్కసారి వేస్తే-నెత్తిన చెంగేసుకుపోవాలి. పెట్టుపెట్టు కుడితి పెట్టు ఒక కడవ నీళ్ళు పోయ్‌రా-

రం : సరేలెండి.

బ : ఐలేమొనగాడివిరా-గడ్డిమోపుదెచ్చి అడబారనూకి ఊరుకొన్నావా? ఒక గుప్పెడు వాటిముఖాన పారేయకూడదూ?

రం : వేస్తానుండండి. ఈపలుపుతాడు పట్టుకొండి.దాన్ని ఆడకట్టేయండి

బ : నాకు పని చెబుతున్నావు కదరా!

రం : ఐలేవాళ్ళే! ఆడకట్టేయండి. దీనికి కుడితిపెట్టి వాటికి గడ్డేసిపస్తా

బ : తొక్కి పాడు చేస్తాయి - ఎక్కువేయొద్దు

రం : అట్టాగే లెండి!

బూ : ఒరే రంగడా! ఒకసారిటు రారా! ఆ కోడిపిల్లలు మెల్లాలోకి పోయాయి. తోలుకురారా!

రం : అయి చిల్లకంపలోకి దూరాయి చూడండి.

బూ : అటు బోయి ఇటు దోలరా వస్తాయి.

రం : సరేలెండి.

బూ : కోడి పొడుస్తుందిరోయ్.

రం : దొరగారికి కోసిపెట్టింది దాన్నికాదా-మొన్న-మీరూ.

బూ : ఓరి నీ నోరుబడ! ఇది పిల్లలకోడిరా! పెద్దగా అరవకురా నీ కంచు గొంతూ నువ్వూనూ! దొర నిద్రలేస్తాడు.

రం : దొరగారేం చేస్తున్నారండి?

బ : ఏదో చేస్తావుంటారోయ్- నీకెందుకు? నీ పని నువ్వు చేసుకుపో!

రం : ఇంత పొద్దెక్కినా నిద్ర పోతావుంటారే - రాత్రంతా ఏం చేస్తా వుంటారండి దొరగారు?

బూ : ఏందిరా సచ్చినోడ బూతులు తిడుతున్నావ్?

రం : రాత్రంతా భారతం సదువుతారా ఏంది అంటే బూతా? మా బాగుందండి మీ వరస.

దొర : (వచ్చాడు) ఎవర్రా అది? నువ్వంటరా రంగడా? ఏందింత పొద్దున్నే వచ్చావు?

రం : తెల్లారి చాలా సేపయిందండి.

దొ : ఏడిశావు లేవోయ్- నాకు చెప్పొచ్చావా? ఏంది విశేషం? ఇంత పొద్దున్నే దిగుమతి అయ్యావు?

అం : చాలా పొద్దెక్కిందని చెప్పు.

రం : చెప్పాప్ లే-నువ్వూరుకో-

అం : కూలి డబ్బు లడుగు.

రం : నీది మరీ విడ్డూరం. ఆయనకు తెలియదా ఏంది?

దొ : ఏందిరా నీ సణుగుడు?

రం : ఏందీ లేదు దొరా!

దొ : ఒరే రంగడూ! నీ పెళ్ళం బాగుందంటరా?

రం : ఆఁ! బాగుదండి.

అం : నిజంగా బాగుందా? నిజంచెప్పు!

రం : బాగాలేదని దొరకెట్టా సెప్పటం?

అం : అందుకని - అబద్ధమాడతావా?

రం : అబద్ధమాడేనే అనుకో - అందులో ఆయనకేమీ నష్టంలేదుగా.

దొ : ఏందిరా నీళ్ళు నములుతున్నావు - పిల్లలు బాగున్నారా?

రం : ఆఁ! బాగున్నారు!

అం : అబద్ధమాడొద్దు నిజంచెప్పు!

రం : బాగాలేరు నిజమే! కాని బాగున్నారని చెప్పినంత మాత్రాన నాకేం ఇబ్బందిలేదు. మంచి మాట విన్న తృప్తి ఆయనకుంటుంది కదా!

అం : అబద్ధం చెప్పిన దోషం అంటుకొంటుంది కదా!

రం : ఏందిరా నీ నస. ఇదిగో నిన్నే-

బూ : నన్నేనా?

దొ : ఆఁ! చద్దన్నం ఉంటే రంగడికి పెట్టు.

బూ : రారా రంగడా! తాళ్ళు చెకులు కడుక్కురా! అవగాయ ఇష్ట మేనా!

రం : ఆఁ!

అం : చద్దన్నం తింటావా?

రం : ఏం కొత్తగా అడుగుతున్నావ్ ?

అం : తిను. అదిగో వడ్డించింది. బాగా తిను.

రం : చద్దన్నం - పెరుగు - ఆవకాయ - ఏంరుచిరా తండ్రి !

అం : నిన్నటినుంచి తిండిలేని నీ పిల్లలు, మంచానపడ్డ నీ పెళ్ళాం నీకు గుర్తున్నారా !

రం : లేకేం ?

అం : నువ్ తింటున్నావా ?

రం : ఇదిగో నువ్ నన్ను చంపుకు తింటున్నావు-నేసీ కూడు తినలేను.

అం : ఏం చేస్తావ్ ?

రం : పారేస్తాను.

అం : ఏది పారెయ్ చూద్దాం.

బూ : ఏరా అన్నం కుక్క కేసేశావు ?

రం : కడుపు నిండింది.

బూ : ఓరి నీ ముఖం మండ !

బ : ఏరా గాడిద ! అన్నం నేలపాలు చేశావు. అక్కరలేనివాడివి వద్దని చెప్పాలి.

అం : నువ్వు మాట్లాడలేవా ? ఏమీ బదులు చెప్పవా ?

రం : ఏమని చెప్పాలి ?

అం : ఏదో ఒకటి.

రం : చెబితే గట్టిగా చెప్పాలి - లేకపోతే నోరు మూసుకోవాలి.

అం : గట్టిగా కూడా సమాధానం చెప్పగలవన్న మాట!

రం : నోరు మూసుకొని కూడా ఉండగల్ను.

అం : ఇది చూశానుగా !

రం : అదీ చూద్దువుగాని.

అం : మీ దొరయినా అంతేనా ?

రం : ఎవరయినా అంతే !

అం : పొద్దు నెత్తిమీదికి వచ్చింది కదా ! నిన్నిప్పుడెవరయినా, పూట కూలికయినా పెట్టుకొంటారా ?

రం : పెట్టుకోరు.

అం : ఏ పూట కూలి ఆ పూట తిండి కదా నీకు !

రం : అవును.

అం : ఒకరోజు కూలీ అడిగి తెచ్చుకోటానికి ఇంకొక రోజంతా పడితే ఎట్టా?

రం : కష్టమే !

అం : నీకీరోజు కూలీ ఎవరిస్తారు ?

రం : ఎవరిస్తారు !

అం : మీ దొరను నువ్వీ ప్రశ్న అడగ గలవా ?

రం : మా దొర నన్నే మడిగినా మాట్లాడకుండా ఉంటా.

అం : అదీ చూద్దాం-

దొ : ఏరా బువ్వ తిన్నావా ?

రం : ఆఁ! తిన్నా-

అం : ఏం ప్రశ్న అడిగినా సమాధానం చెప్పనంటివే - ఇంతలోనే మాట తప్పావే-

బూ : తిన్నాడా పాడా ?

బ : కూడంతా కుక్కకేశాడు ?

దొ : ఏరా కూడు పాడుచేశావా ?

రం : నాకు నా కూలీడబ్బులు కావాలి. ఇంట్లోకూడొండుకోవాలి !

అం : ఫరవాలేదు. ధైర్యంగా కూలిడబ్బులడిగావు.

దొ : ఇస్తాను గాని- నోటికాడి కూడు నేలపాలు చేశావా?

రం : నా పెళ్ళం పిల్లలకు కూడులేదు. కూలీ తీసుకెళితేనే కూడూకుమ్మ.

దొ : అన్నం పారేశావా?

రం : నా కూలీడబ్బు!

దొ : ముందిది చెప్పు! అన్నం పారేశావా?

రం : ముందు నా కూలీడబ్బు నా ముఖాన పారేయండి.

దొ : ఏమిరా అడిగిందానికి బదులు పలకవు.

రం : నా డబ్బు నాకిస్తే, నా తోవన నే బోతా.

దొ : డబ్బులేదు గిబ్బులేదు-పో-ఏంరా అట్టా జూత్తావు-పో-అవతలికి. కదలవేంరా! ఏందిరా ఆ తలబిరుసు-అట్టా మిర్రిమిర్రి చూస్తావ్ రోగమా? - ఎక్కడికిరా పోతున్నావు - నేను పొమ్మంటే పోవట మేనా? - డబ్బువద్దా-డబ్బుచేదా-నీకూలీ డబ్బు నేనేం చేసుకోను-తీసుకుపో-ఏం-నీ కక్కర లేదా? ఏందిరా ఆ లాక్కోవటం-కాస్త నెమ్మదిగా చూడరా ఎంతో అది-ఎక్కువ తక్కువలున్నా నీకు లెక్కలేదా? ఏందిరా నీ పొగరు? - ఏమిటా మకురుచూపు-మీకు నాలుగురాళ్ళు కనిపిస్తే పొగర్రా! మీ అంటరాని జాతికంతా ఇంతే- నీలాంటోళ్ళని నాలుగుతంతే కాని సరిగారు.

బూ : ఆ ఎదవతో ఎందుకు మీకు? మీరిటురండి.

బ : ఆడు మొండిబండ. ఆడుతో ఏంది మాట్లాడేది- మానేస్తేసరి.

దొ : ఏంరా నిలబడ్డావు. ఏంటాచూపు- ఎందుకెనక్కివస్తావుపో! డబ్బు గుంజుకొన్నావుగా- వెళ్ళిపో!

రం : వెళ్ళే ముందొకమాట.

దొ : ఏందో చెప్పేడువు.

రం : ఎవడిస్తాడు నాకీ రోజు కూలీ?

దొ : ఎవుడికి పనిచేసే వీవాళ?

రం : మీ యింట్లోనే!

దా : నేన్నిన్ను పని చేయమని చెప్పానా?

రం : అన్లేదు. మీ వాళ్ళు పని చేయించుకొన్నారు- ఎందుకు చేయించుకొన్నారు? నిన్నటి కూలీకోసం వచ్చాను కాబట్టి.

దా : తీసుకుపోతున్నావుగా!

రం : ఈరోజేమీ పనిలేకుండా పోయింది నాకు.

దా : అందుకు నేనా బాధ్యుడిని!

రం : అవును మీరే! నిన్నటికూలీ నిన్ననే ఇచ్చి ఉంటే నేనిక్కడికి వచ్చి ఉండేవాణ్ణికాను. కూలికిపోయి ఉండేవాణ్ణి.

దా : మరి పోకపోయావా?

రం : ఈ కూలీ డబ్బు లేకపోతే ఇంట్లో కూడు లేదు.

దా : ఇకనుంచి ఏరోజు కూలీ ఆరోజే ఇస్తాలేరా!

రం : ఇకనుంచి? అదేనాటి మాటో-

అం : నువ్ మాటమీద నిలబడ్డావు- నాకు నచ్చావు- మౌనమూ బాగుంది.. మాటా బాగుంది. ప్రశ్నించటమూ బాగుంది.

రం : ఏడిశావులే!

అం : కోప్పడటమూ బాగుంది.

రం : నువ్వే నేర్పిందేగా - అవసరమయినప్పుడు నాకు ఏంచేయాలో చెబుతూ ఉండు.

అం : నువ్వు అర్థం చేసుకొన్నావు. అవసరమైతే ప్రశ్నించాలి. కోపించాలి. ఈ ధర్మాగ్రహం నీ సంసారం చక్కబెడుతుంది. నీ భార్య ఆరోగ్యం బాగుపడుతుంది. నీ పిల్లలు ముప్పూటలా తిండి తింటారు. నీ ప్రశ్న కోపాల పడుగుపేకల జమిలినేత దివారాత్రాలు సృష్టించి సృష్టి చక్రం తిప్పుతుంది. నీకు శుభం-

(తెర)